LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 34 | 25.8.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# విపక్షాల దీక్ష, చంద్రబాబు కక్ష, ప్రజలకు ఛార్జీల శిక్ష!

రాష్ట్ర రాజకీయ వాతావరణం గంభీరంగా వుంది; తుఫాన్ ముందర ప్రశాంతతను తలపింపచేస్తున్నది. ఓల్డ్ ఎమ్మెల్యే క్వార్టర్స్‌లో కాంగ్రెస్, కమ్యూనిస్ట్ శాసన సభ్యులు నిరసన వ్రతం చేపట్టి నేటికి ఎనిమిది రోజులు. దాదాపు అరవై మంది పంటి బిగువున ఆకలి బాధ భరిస్తూ దీక్ష కొనసాగిస్తున్నారు. ఆకలి బాధ కంటే వసతులు లేమి వీరిని చికాకు పరుస్తున్నది. జడివానకు శిబిరం కూలిపోవడంతో అందరూ చెల్లా చెదరై పోయారు. వరండాల్లో జంపకానాలు పరుచుకొని విశ్రమించాల్సి వస్తున్నది. ప్రతిరోజూ వానే; దాని వెంట చలి; పగలంతా వచ్చిపోయే కార్యకర్తలతో కాలక్షేపం జరిగినా, రాత్రి అయ్యేసరికి చికాకు వచ్చేస్తున్నది. నగం మంది దగ్గర కప్పుకోవడానికి దుప్పట్లు కూడా లేవు; సరైన దిండ్లు లేవు; రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫారాలపై బిక్షగాళ్ల వలె కటిక నేలమీద పవళించవలసి వస్తున్నది.

అలవాటు లేకుండా ఇంత కష్టం భరించడం పెద్ద శిక్ష కాని ఈ సమస్యల న్నింటిని తాను కూడా భరిస్తూ వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఏ మాత్రం మడమ తిప్పేది లేదన్నట్లు దృఢంగా వుండి పోవడంతో, తతిమా ఎమ్మెల్యేలు తమ భావాలను మనసులోనే అణచుకొని, పైకి గంభీరంగా కన్పిస్తున్నారు. మగర్ సమస్యలు, గుండె జబ్బులు కల్గిన పది, పదిహేను మంది తప్ప తక్కిన అందరూ ఎనిమిది రోజులైనా ఇంటికి వెళ్తామని అడగక పోవడం విశేషం. కొందరైతే ప్రభుత్వం దిగి వచ్చేంత వరకు దీక్ష విరమించేది లేదని పట్టు పడ్తున్నారు. వీరు అంత గట్టిగా వాదించబట్టే బిజెపి నేతల రాయ బారం విఫలమైంది.

ప్రభుత్వ పరంగా ఇప్పటి వరకు సరైన స్పందన లేదు. చంద్రబాబు గుంభనంగా వున్నాడు. అట్లని మనసులో గుబులు లేకుండా పోలేదు. దీని వల్ల వచ్చే పరిణామాలు ఎదుర్కోవల్సిన వాడు, కష్టం భరించవల్సిన వాడు తానే అయినప్పుడు గుబులు లేకుండా ఎట్లా వుంటుంది? కాని తనంత తాను చొరవ చూపి రాజీ ప్రతిపాదనలు చేస్తే చులకనై పోతానన్న సందేహం ఆయన మౌనానికి కారణం. అందుకు బిజెపి నేతలు మధ్యస్థం చేస్తానంటే వెనుకా ముందు చూసుకోకుండా సరేనన్నాడు. కాని వారి ప్రతిపాదనలు అలివయ్యేవి కావు.

విద్యుత్ ఛార్జీల పెంపకంపై శాసనసభా సంఘం నిర్ణయించి, దాని రిపోర్ట్ వచ్చే వరకు స్వచ్ఛందంగా కట్టేవారి నుంచి తప్ప బిల్లుల వసూలు నిలపాలన్నది వారి ప్రతిపాదన. బిల్లు కట్టని వారికి డిస్కనెక్షన్ చేయకుండా వదిలేస్తారని తెలిస్తే రాష్ట్రంలో ఒక్కరు కూడా బిల్లు కట్టరన్నది తెలిసిన నిజం. అదే జరిగితే విద్యుత్ సంస్థ దివాలా తీస్తుంది. దాని కంటే పాత రేట్లలో

తరువ 7వ పేజీలో

## ఢిల్లీలో వసివాడిన ముఖ్యమంత్రి ముఖం!

11వ ఆర్థిక సంఘం సిఫార్సు లకు వ్యతిరేకంగా ముఖ్యమంత్రుల మద్దతు కూడ గట్టడానికి చంద్రబాబు చేసిన ప్రయత్నం విఫలమైంది. 17 మంది ముఖ్యమంత్రులు వస్తారని ప్రచారం చేశాడాయన. కాని చివరి నిముషంలో అందరు ముఖం చాటే శారు; ముఖ్యమంత్రి ముఖం మాడి పోయింది. సమావేశం తర్వాత ప్రధాన మంత్రిని కలవడానికి అపాయింట్ మెంట్ ఇవ్వక పోవడంతో మరీ భంగ పడ్డాడు చంద్రబాబు. ఈ అవమానం తప్పించుకోవడానికి చాలా తంటాలు పడ్డాడాయన. వినతి పత్రం మాత్రం ఇచ్చి వెళ్తాను, ఒక్క నిముషం వీలు కల్పిస్తే చాలు అని బ్రతిమలాడుకుని, చివరకెట్లో ప్రధానమంత్రిని వప్పించినా - తమ సమయం వృధా చేశారని వచ్చిన నలుగురు ముఖ్యమంత్రులు కూడా రుసరుసలాడారు. ఢిల్లీ రాజకీయాలలో కింగ్ మేకర్‌గా వుండాలన్నది చంద్రబాబు తపన. దేవగౌడ, గుజ్రాల్ కాలంలో ఆ కర్ర పెత్తనం పనిచేసింది. కాని వాజ్‌పాయి అందుకు అవకాశం ఇవ్వడం లేదు. *



విద్యుత్ ఛార్జీల పెంపును నిరసిస్తూ హైదరాబాద్‌లో ఆమరణ దీక్షలో వున్న వెంకటగిరి ఎమ్మెల్యే నేదురుమల్లి రాజ్యలక్ష్మి. సిఎల్‌పి. నేతను పరామర్శిస్తున్న మాజీ ఎమ్మీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి.

# గల్లంతయిన బొల్లినేని - ఏ గల్లీలో తిరుగుతున్నాడో?

ఆత్మకూరు శాసన సభ్యుడు బొల్లినేని కృష్ణయ్య అడ్రస్ దొరకకపోవడం పెద్ద చర్చగా వుంది హైదరాబాద్‌లో. నిరసన దీక్షలలోనే కాదు, అసెంబ్లీ హాలలో కూడా ఎప్పు డేడు ఆయన. కృష్ణయ్య రాజకీయ వాది కాదు; రాజకీయ లక్షణాలు కూడా లేవు. కొమ్మి లక్ష్మయ్య నాయుడుపై కసి తీర్చుకోవడం ఒక్కటే ఆయన ఎన్నికల పోరాట లక్ష్యం; నిజానికి కృష్ణయ్య కాంగ్రెస్‌తో కంటే తెలుగుదేశంతోనే బంధుత్వం జాస్తి. చంద్రబాబు నాయుడు ముఖ్య దోస్తులలో ఆయన ఒకడు. అది ఇప్పటి బాంధవ్యం కాదు - చాలా కాలం నుంచి నడుస్తున్నది.

అయితే పార్టీ టిక్కెట్‌పై గెల్చి

## శాసనసభకు రాడు - నిరాహారదీక్షలో లేడు!

నప్పుడు కనీసం అసెంబ్లీ లోపల అయినా పార్టీ పరిమితులకు లోబడి వ్యవహరించడం మర్యాద. 70ఏళ్ల వయస్సు కల్గి, బైపాస్ వంటి ఆపరేషన్లు చేయించుకున్న వారు సైతం పార్టీ ఆదేశాన్ని పాటించి నిరసన వ్రతంలో పాల్గొంటున్నప్పుడు, కృష్ణయ్య ఒక్కడు ముఖం తప్పించడం నలుగురు నాలుగు మాటలు అనడానికి అవకాశం కల్గిస్తున్నది. కనీసం మర్యాద కోసమైనా ఆయన ఒకసారి శిబిరానికి వచ్చి వెళ్లి వుంటే ఇంత విమర్శ వచ్చేది కాదు. కాని ఎందువల్లనో ఆయన హైదరాబాద్‌లో వుండి కూడా, శిబిరం దిక్కు చూడలేదు. ఇప్పటికైనా తన తప్పు సరిదిద్దుకుంటే ఆయనకు ప్రతిష్ఠ పార్టీకి కూడా గౌరవం.

తతిమా ముగ్గురు ఎమ్మెల్యేలు - నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, ఆనం వివేకానందరెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి - మనస్ఫూర్తిగా దీక్షలో పాలు పంచుకుంటున్నారు. రాజ్యలక్ష్మమ్మ గారిది పెద్ద వయస్సు - మొన్ననే అరవై పెట్టింది ఆమెకు; అయినా కుర్ర ఎమ్మెల్యేలతో సమంగా ఆరు రోజులు ఆకలి తట్టుకున్నది. ఆ తర్వాత ఆరోగ్య సమస్య తలెత్తి, డాక్టర్లు ఆస్పత్రికి తరలించినా ప్రక్క రోజు మళ్లీ శిబిరానికి వచ్చేశారామె. వివేకా, రామనారాయణరెడ్డి లిద్దరికీ నిరసన వ్రతం పాతదే. మున్సిపల్ ఛైర్మన్ల సమస్యపై వివేక పదమూడు రోజులు దీక్ష పట్టాడు ఇదివరకు; కండ్లేరు నీళ్ల పోరాటంలో 11 రోజులు తిండి మానేసి కూర్చున్నాడు రామనారాయణ గత సంవత్సరం. ఆ పాత అలవాటు ప్రభావం కాబోలు ఇప్పుడు వరసగా ఎనిమిది దినాల నుంచి అన్నం లేక

తరువ 12వ పేజీలో

# సంస్కరణలంటే చావబాదడమా?

విద్యుత్ సమస్యపై ప్రతిపక్షాలు ఏ ప్రశ్న వేసినా ముఖ్యమంత్రి చంద్ర బాబు నాయుడు సంస్కరణల గురించి మాట్లాడుతున్నారు; కరెంట్ ఛార్జీలు తగ్గిస్తే ఆర్థిక సంస్కరణలు వెనక్కు వెళ్లి పోతాయని. అందువల్లే తాను ఈ విషయంలో చేయగల్గింది ఏది లేదని నిర్వేదం వ్యక్తం చేస్తున్నారు.

### వింతకూ సంస్కరణలు అంటేఏమిటి? ఎవరికోసం?

డిక్షనరీ అర్థం ప్రకారం సంస్కరణ అంటే వున్నదాన్ని సరిదిద్దడం. అంటే, వున్న వ్యవస్థ సక్రమ ఫలితాలు ఇవ్వ నప్పుడు, దాన్ని ప్రయోజనవంతం చేయడం కోసం మార్పులు చేయడం.

ప్రయోజనం అంటే ఎవరిది అన్న ప్రశ్న కూడా వేసుకోవాలి. ఇప్పుడు మనం మాట్లాడు తున్నది విద్యుత్ ఛార్జీల గురించి. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి గురించి కాబట్టి, ఇక్కడ ప్రయోజనం అన్నది ప్రజలకు సంబంధించినదే కావాలి. అదే నిజమైతే, ప్రజల నుంచి అధిక ఛార్జీలు దండడం ప్రజల ప్రయోజనం కోసమేనని భావించడం ఎట్లా?

కరెంట్ వుత్పత్తి ఖర్చు పెరిగి పోయింది కాబట్టి, ధరలు పెంచక తప్పడం లేదని; తక్కువ ధరలకు కరెంట్ సరఫరా చేస్తే, విద్యుత్ సంస్థ ఎక్కువ కాలం కరెంట్ ఇవ్వలేదని చంద్రబాబు వాదం.

కాని పెరిగిన ఉత్పత్తి ఖర్చు ఎంత? పెంచిన ఛార్జీల మొత్తం ఎంత? హైడల్ ప్రాజెక్ట్ ద్వారా జరిగే జల విద్యుత్ యూనిట్ ఉత్పత్తి ఖర్చు కేవలం రెండు రూపాయల ఎనభైనిమిది పైసలు అవుతున్నది. అంటే ఆయన లెక్క ప్రకారం ఒక్క యూనిట్‌కు 86 పైసల లాభం వస్తున్నదన్న మాట. పరిశ్రమల నుంచి సగటున దాదాపు ఐదు రూపాయలు దండుతున్నారు; ఇతర రాష్ట్రాల నుంచి కొనే విద్యుత్ ఖరీదు రెండు రూపాయలకు మించడం లేదు; ఎన్‌టి పిసి అయితే కేవలం రూపాయి నలభై పైసలకు ఇస్తున్నది. ఇట్లా కొన్న విద్యుత్ కేవలం పరిశ్రమలకు మాత్రమే ఇచ్చినా, విద్యుత్ సంస్థ ఒక్కొక్క యూనిట్‌కు కనీసం రెండున్నర రూపాయల లాభం

### సామాన్యుడి నడ్డి విరిగింది

సంపాదిస్తున్నది. ఇక మిగిలింది వ్యవ సాయం. దీనికి చాలా సబ్సిడీ ఇస్తున్నా మన్నది ప్రభుత్వ వాదం. కాని జల విద్యుత్‌పై రైతులదే ప్రధాన హక్కు. దాని ఉత్పత్తి ఖర్చు 30 పైసలు; రైతుల నుంచి దండుతున్నది యాభై పైసలు. ఇంక సబ్సిడీ ఎక్కడ వుంది? పోని

| యూనిట్లు | 18/12/1991లో కాంగ్రెస్ పెంచిన ధర | ఇప్పటి ధర | పెరిగిన శాతం |
|---|---|---|---|
| 0 - 50 | 0.50 | 1.35 | 170 |
| 51 - 100 | 0.80 | 2.95 | 268 |
| 101 - 200 | 1.00 | 2.95 | 195 |
| 201 - 300 | 1.25 | 4.50 | 260 |
| 300 - 400 | 1.35 | 4.50 | 260 |
| 401పైన | 1.45 | 5.25 | 262 |

సగటు ఉత్పత్తి ఖర్చు పరిగణనకు తీసుకున్నా, రైతుల వల్ల వచ్చే నష్టం



ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు వద్ద నుండి ఇండియన్ పోలీస్ మెడల్ స్వీకరిస్తున్న సింగరాయకొండ సర్కిల్ ఇన్స్పెక్టర్ కె. సత్యనారాయణ

ముప్పై పైసలు; థర్మల్ విద్యుత్ కేంద్రాలలో రూపాయి ఎనభై పైసలు. మొదటిది 20శాతం; రెండవది 80 శాతం అనుకున్నా సరాసరి ఉత్పత్తి ఖర్చు ఒకటిన్నర రూపాయలు మాత్రమే. దీనికి ట్రాన్స్‌కో చెప్పే ట్రాన్స్‌మిషన్ నష్టాలు 38 శాతం కల్పినా రెండు రూపాయల రెండు పైసలు అవుతుంది. పూర్తిగా చంద్రబాబు చెప్పే లెక్కల ప్రకారమే చూసి; మొత్తం విద్యుత్ వినియోగదారులలో 60 శాతం మంది 100 యూనిట్ల లోపు, 40 శాతం మంది మాత్రమే అంతకంటే ఎక్కువ వాడు తారని భావించినా, ఇప్పుడు పెంచిన ధరల ప్రకారం సరాసరి యూనిట్ ఛార్జీ యూనిట్‌కు ఒకటిన్నర రూపాయలు; పరిశ్రమల నుంచి వచ్చే లాభం రెండు న్నర రూపాయలు; ఇక సబ్సిడీ ఎక్కడ వున్నట్లు?

విద్యుత్ సంస్థ ప్రతి యూనిట్‌ను లాభానికి అమ్ముతున్నప్పుడు, వారికి నష్టం ఎందుకు వస్తున్నది? అప్పులు చేయవల్సిన పరిస్థితి ఎందుకు ఏర్ప డుతున్నది?

1994లో చంద్రబాబు నాయుడు అధికారంలోకి వచ్చే వరకు సంస్థ లాభాలలో నడిచింది. అప్పుడు కూడా రైతులకు తక్కువ ధరకు కరెంట్ ఇచ్చారు. ట్రాన్స్‌మిషన్ నష్టాలు వున్నా యి. చంద్రబాబు రాగానే విద్యుత్ సంస్క రణలు ప్రవేశపెట్టారు; ప్రపంచ బ్యాంక్ నుంచి అప్పు తెచ్చారు; 1995 ఆగష్టు లో, 1996 జులై నెలలో, 1998 డిసెం బర్ నెలలో మూడు సార్లు ధరలు పెంచా రు. అవి చాలక ఇప్పుడు మళ్లీ ఛార్జీలు హెచ్చించారు. ఈ క్రింది పట్టిక చూడండి.

ఈ ధరలను వున్నవి వున్నట్లుగా సరాసరి చేస్తే 1991లో ధర రూపాయి ఐదు పైసలైతే, ఇప్పుడు మూడు రూపాయల యాభై ఎనిమిది పైసలు అంటే గత ఐదు సంవత్సరాలలో చంద్రబాబు కరెంట్ ఛార్జీలను సగటున రెండున్నర రెట్లకు పైగా పెంచినట్లు లెక్క. ఇంత పెంపకం తర్వాత కూడా తాను విద్యుత్ సంస్థకు పదహారు వందల కోట్ల రూపాయల సబ్సిడీ ఇస్తు న్నానని చెప్తున్నారు చంద్రబాబు. ఈ ధరల పెరుగుదలకు ప్రతిసారీ ఆయన చెప్పే కారణం సంస్కరణలు; సంస్క రణల లక్ష్యం వున్న వ్యవస్థను మెరుగు పర్చడమైతే, ఏటి కేడాది ధరలు పెరగడ మేమిటి; రెండున్నర రెట్ల పెంపకం తర్వాత విద్యుత్ సంస్థ నష్టాలు 80కోట్ల నుంచి 3600కోట్లకు పెరగడమేమిటి?

ఎక్కడుంది లోపం? ప్రభుత్వం చెప్పే లెక్కలలోనా లేక విద్యుత్ సంస్థ నిర్వాహణలోనా? నిర్వాహణలోపమే అయితే అందుకు బాధ్యులు ఎవరు? తప్పుడు లెక్కలు చెప్తూంది, ఎందు కోసం?

ఈ ప్రశ్నలకు జవాబు చెప్ప వల్సింది చంద్రబాబు ఒక్కడే. కాని ఆయన అవి తనకు విన్పడనట్లే నటిస్తు న్నాడు. పశ్చిమ బెంగాల్‌లో ఇంతకంటే ఎక్కువ రేట్లు వున్నాయని, కర్నాటకలో కూడా సంస్కరణలు చేపడుతున్నారని మాట్లాడుతున్నాడే తప్ప, ధరలు ఇంతగా ఎందుకు పెంచవల్సి వస్తున్నది అన్న ప్రశ్నకు సక్రమ సమాధానం ఇవ్వడం లేదు. ఇవ్వలేడు కూడా. అందుకు కారణం ధరల పెంపకానికి, కరెంట్ ఉత్పత్తికి, అమ్మకాలకు సంబంధం లేక పోవడమే.

ధరల పెంపకానికి అసలు కారణం విద్యుత్ సంస్థ నిర్వహణా లోపం. విపరీతమైన అవినీతితో, అసమర్థతతో కుళ్లి పోయింది ఆ సంస్థ. కరెంట్ దొంగత నాలే కాదు; ట్రాన్స్‌ఫార్మర్లు, తీగలూ, మీటర్లూ వంటి వాటి కొనుగోలులో అవినీతికి పాల్పడి, చవకబారు సరకు కొని, విద్యుత్ సరఫరా నష్టాలు పెరగ డానికి కారకులౌతున్నారు అధికారులు. వారిని ప్రశ్నించే సాహసం ముఖ్యమంత్రికి లేదు. అందుకు కారణం ప్రతి సరఫరా దారుతో ఆయనకు లాలూచీ వుంది.

తరువా 12వ పేజీలో



తడ నిప్పో ఫ్యాక్టరీ డిప్యూటీ జనరల్ మేనేజర్ జి.డి. రెడ్డి కుమార్తె ప్రతిమ, అక్కకూరు అల్లారెడ్డి కృష్ణారెడ్డి కుమారుడు హైదరాబాద్‌లో పంటి డాక్టర్ ఉదయభాస్కరరెడ్డి వివాహం 18 తేది తడ నిప్పో ఫ్యాక్టరీ క్వార్టర్స్‌లో జరిగింది.

## పెండ్లిండ్లు

నెల్లూరీయుల పెళ్లిళ్ల వార్తలు ప్రచురించడం యాభైఏళ్లకు పైగా జమీన్‌రైతు సాంప్రదాయం. ఏదో ఒక కారణంతో గత రెండు సంవత్సరాలుగా ఈ శీర్షిక ప్రచురణ వీలు కాలేదు. ఇప్పుడు దీన్ని మళ్లీ పునఃప్రారంభి స్తున్నాము. పాఠకులు గమనించమనవి. జమీన్‌రైతు పాఠకులు జిల్లాలో జరిగే పెండ్లి శుభ కార్యక్రమ వివరాలు తెలియ చేయవల్సిందిగా ప్రార్థన.

\- సంపాదకుడు

### శాస్త్రిగారి కుమారుడు

సర్జరీలు చేయడంలో చేయి తిరిగిన వైద్యుడు, సోషలిస్టు భావ సంపన్నుడు, శరీరం కమ్యూనిస్టు పార్టీలో, చిత్తం అధికార పార్టీలో అన్నట్లు మెలిగే లౌకికుడు, రాజకీయాలను హాబీగా తప్ప సీరియస్‌గా పరిగణించని స్నేహపాత్రుడు, నెల్లూరు డాక్టర్లకు ఒక రకంగా కులగురువు డాక్టర్ మధుసూధనశాస్త్రి గారి తనయుడు డాక్టర్ చంద్రశేఖర్‌కు; గుంటూరు, శ్రీ ధన్వంతరి శర్మ తనయ డాక్టర్ రాజరాజేశ్వరితో పరిణయం 18తేది గుంటూరులో జరిగింది.

### కోడూరు పోస్ట్‌మాస్టర్

తోటపల్లిగూడూరు మండలం కోడూరు బ్రాంచ్ పోస్ట్‌మాస్టర్, పిట్టంత మనిషైనా ఘనమైన గొంతు, కమ్మటి పద్యాలు వ్రాసి, చదివి వినిపించే సాహిత్య పిపాసి, వార్తా సేకరణలో సత్కాలక్షేపం చేసే సన్మిత్రుడు - వల్లూరు మాధవరావు తనయ వెంకట భవాని శంకరి పెండ్లి - ముత్తరాజు విశ్వేశ్వరరావు గారి తనయుడు పవన్ కుమార్‌తో 18తేది నెల్లూరు పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది.

### మాగుంటవారింట పెండ్లి

మాగుంట సోదర త్రయ మధ్య ముడు, సిరి సంపదల కంటె స్నేహానికి విలువ ఇచ్చే సన్మిత్రుడు భేషజం లేని వ్యక్తి మాగుంట సుధాకరరెడ్డి కుమారుడు కిరణ్; అమెరికాలో స్థిరపడిన పాపిరెడ్డిగారి కుమార్తె స్వాతి పరిణయం 6తేది సికింద్రాబాద్‌లోని ఇంపీరియల్ గార్డెన్స్‌లో కన్నుల పండుగగా జరిగింది.

సుబ్బరామరెడ్డి గారు సజీవుడుగా వున్నప్పుడు మాగుంటవారి ఇంట జరిగే ప్రతి శుభకార్యం నెల్లూరు జిల్లా అంతటికి పండుగగా వుండేది; ఆ కుటుంబానికి ఆయనలేని లోటు ఎటువంటిదో ఈ పెండ్లిలో స్పష్టంగా కన్పడింది.

### అమెరికా వరుడు

నాయుడుపేట, హస్తవరం సుబ్రహ్మణ్యం కుమార్తె సునీత; నెల్లూరు, స్వర్గీయ పెళ్లూరు వెంకట్రామయ్య కుమారుడు, అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు శ్రీకాంత్ పెండ్లి 4తేది నాయుడుపేట పాదీ మంజిల్‌లో జరిగింది.

### సారథి - హిమబిందు

ముత్తుకూరు మండలం వల్లూరు గ్రామ కరణాల కుటుంబీకుడు, ప్రస్తుతం కావలి వాస్తవ్యుడు వల్లూరు రాజేంద్రరావు తనయుడు విజయసారథి; విద్యుత్ బోర్డు అసిస్టెంట్ ఇంజనీరు దండిగుంట చలపతిరావు తనయ హిమబిందుల పెండ్లి 4తేది నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగింది. వరుడు అమెరికాలో కంప్యూటర్ ఇంజనీర్.

### శ్రీహరికోట పెండ్లి

షార్ ప్రాజెక్ట్ వుద్యోగి జలదంకి కొండయ్య నాయుడు గారి కుమారుడు మాల్యాద్రి; స్వర్గీయ నారాయణస్వామి కుమార్తె శిరీషల పరిణయం 16తేది సికింద్రాబాద్‌లో జరిగింది.

### తూములూరు వారి కుమారుడు

జిల్లాలో ప్రసిద్ధ న్యాయవాద కుటుంబ వారసుడు, స్వతహాగా తాను కూడా న్యాయశాస్త్ర అవపోసన పట్టినా కోటు తొడుక్కోకుండా చదువు చెప్పడంతో తృప్తి పడిపోయిన విశా లా కాలేజి రిటైర్డ్ ప్రిన్సిపల్ తూములూరి శివకామ సుందరం కుమారుడు, ఐఐటి కరగ్‌పూర్‌లో రీసెర్చ్ స్కాలర్‌గా వున్న ప్రతిభావంతుడు జయశంకర్ ఎంటెక్‌కు; నాయుడుపేట పెడబ్బాడి అసిస్టెంట్ ఇంజనీర్ జి.ఆర్.ఎస్. శర్మ గారి తనయ నాగ శ్రీవల్లి ఎంసిఏతో పెండ్లి 2తేది

తరువా 7వ పేజీలో

# స్పీకర్ పదవికి గౌరవం కాదు

రాష్ట్ర శాసనసభ స్పీకర్‌గా శ్రీమతి ప్రతిభా భారతి ప్రవర్తన శాసనసభ హూందా తనానికి, సాంప్రదాయాలకు తగినట్లు లేదని వ్యాఖ్యానించడానికి బాధ కల్గుతున్నది. విమర్శలకు, వివాదాలకు అతీతంగా వుండవల్సిన గౌరవనీయమైన పదవి ఇది. గెల్చేది పార్టీ టిక్కెట్‌పైనే అయినా, ఆ సీట్లో కూర్చోగానే పార్టీ బంధాలు తెంచుకోవడం స్పీకర్లకు వుండాల్సిన కనీస అర్హత. సభలోని అందరు సభ్యులను సమ దృష్టిలో చూడడం, సభలో ప్రతిఒక్కరికి సమాన అవకాశాలు లభింపచేసేందుకు ప్రయత్నించడం స్పీకర్ నిర్వహించవల్సిన కనీస బాధ్యత. ఏ సభ్యుడికి ఏ చిన్నకష్టం కల్గినా, తాను పెద్దరికం వహించి దాన్ని సరిదిద్దేందుకు కృషి చేయడం స్పీకర్ పదవిలో వుండేవారి కనీస కర్తవ్యం.

కాని ప్రతిభా భారతి గారి విషయంలో ఈ సాంప్రదాయాలు పాటిస్తున్న సూచన కన్పించడం లేదని చెప్పవల్సి రావడం బాధాకరం. ఇటీవలి సమావేశాలలో దాదాపుగా అందరు ప్రతిపక్ష నేతలు ఆమె పట్ల తమ అసంతృప్తి ప్రకటించారు; నిరసన తెల్పారు. నేరుగా స్పీకర్‌ను వుద్దేశించి ప్రతిపక్ష సభ్యులు పక్షపాత ఆరోపణ చేయడం అరుదైన విషయం. తమిళనాడు, బీహార్, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో స్పీకర్లు తరచు రాజకీయ వివాదాలలో చిక్కుకోవడం మామూలు కాని, మన రాష్ట్రంలో ఇప్పటి వరకు పనిచేసిన స్పీకర్లు అందరు అటువంటి పరిస్థితులు రాకుండా జాగ్రత్తపడేవారు. అందువల్లే ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకర్లకు దేశవ్యాప్తంగా ప్రత్యేక ప్రతిష్ట.

ప్రతిపక్ష నేతలు తనను వేలు పెట్టి చూపించిన తర్వాత అయినా ప్రతిభా భారతి గారు ఆత్మ పరిశీలన చేసుకొని వుంటే బాగుండేది. కాని అటువంటిది జరిగినట్లు లేదు.

గత ఎనిమిది రోజులుగా కాంగ్రెస్ కమ్యూనిస్టు ఎమ్మెల్యేలు నిరాహార దీక్ష చేస్తున్నారు. వారి ఆందోళన రాజకీయ పరమైనదే కావచ్చు; కాని ఒక ప్రజాసమస్యపై ఎమ్మెల్యేలు తిండి మానేసి నిరసన వ్రతం పాటిస్తున్నప్పుడు అందులోనూ ఆ నిరసన తన ఆధీనంలోని ఎమ్మెల్యే క్వార్టర్స్ ప్రాంగణంలో జరుగుతున్నప్పుడు, వారిని లాంఛనంగా అయినా పలుకరించడం, యోగక్షేమాలు విచారించడం స్పీకర్ బాధ్యత కాదా? చట్ట సభ నియమాలు పుస్తకంలో ఈ నిబంధన లేకపోవచ్చు. కాని అది కనీస మానవియత. గతంలో తెలుగుదేశం సభ్యులు అసెంబ్లీ ఆవరణలో నిరాహార దీక్షకు పూనుకున్నప్పుడు అప్పటి స్పీకర్ తల్లడిల్లి పోయాడు. ఎమ్మెల్యేలు అసెంబ్లీలోపల తిండి లేకుండా పడి వుంటే, నేను ఇంటికెట్లా పోగలను అని వ్యాఖ్యానించి ఒకరాత్రి అంతా తన ఛాంబర్‌లోనే వుండిపోయాడాయన. గంటకొకసారి ఎమ్మెల్యేల అవసరాలు గమనించారు. అదీ - సాంప్రదాయం.

శాసన సభలో గత వారం రోజులుగా ప్రతిపక్షమన్నదే లేదు. కేవలం తెలుగుదేశం, బిజెపి సభ్యులు కూర్చుని, ప్రభుత్వ వాదాన్ని మాత్రమే విన్పిస్తూ, ప్రభుత్వ నిర్ణయాలకు శాసనముద్ర వేస్తూ కాలం గడుపుతున్నారు. దేశ చరిత్రలోనే ఇటువంటి సంఘటన మరొకటి లేదు. శాసన సభ ఉనికిని, మనుగడను, మౌలిఖ లక్ష్యాన్ని ప్రశ్నార్థకం చేసే పరిస్థితి ఇది. సభలో తమ తప్పులు ఎత్తి చూపేవారు లేకుండా ప్రభుత్వ పక్షం పరిపాలన నిర్ణయాలకు శాసన బద్ధత కల్పించుకోవడం అంటే, ప్రజాస్వామ్యాన్ని కాలదన్ని, నియంతృత్వాన్ని అమలు చేయడం క్రింద లెక్క. ఒక రకంగా దీన్ని రాజ్యాంగ సంక్షోభం క్రింద పరిగణించాలి. శాసనసభ అటువంటి విపరీత పరిస్థితులు ఎదుర్కొంటున్నా, స్పీకర్‌లో వులుకు పలుకు లేక పోవడం విచారకరం. సభ తన రాజ్యాంగ విధులు నిర్వర్తించడానికి కావల్సిన పరిస్థితులు కల్పించడం తన బాధ్యత అని మర్చి పోయారు ఆమె. తాను కూడా తతిమా తెలుగుదేశం నేతలలో ఒకరని అన్నట్లు నిమ్మళంగా వుండిపోతున్నారు.

ప్రతిభా భారతి గారి స్థానంలో మరెవరు వుండినా ఇట్లా ప్రవర్తించరనడం ఆరోపణ అని మేము భావించడం లేదు. సభకు ప్రతిపక్షాలన్నీ మూక ఉమ్మడిగా గైర్హాజరు అవుతున్నప్పుడు, సభ నిర్వాహణ కేవలం ఒక ప్రహసనం మాత్రమే నన్న ఇంగిత జ్ఞానం లేక పోవడం శోచనీయం. కనీసం ప్రతిపక్ష పార్టీలను చర్చలకు పిల్చి, సభకు హాజరు కమ్మని కోరలేదామె. ప్రతిపక్షాలు లేని సభలో శాసనపర నిర్ణయాలు తీసుకోవడం ప్రజాస్వామ్య సమ్మతం కాదని ప్రభుత్వ పెద్దలకు సలహా కూడా ఇవ్వలేదు. ఏక పక్షంగా సభ నడపడంలో తప్పేమీ లేదన్నట్లు, ప్రతి దినం సభను సమావేశ పరుస్తున్నారు; కార్యకలాపాలన్నింటినీ జరిపిస్తున్నారు.

ఒక అంశంపై ప్రతిపక్షాలు వాకౌట్ చేస్తే, ఆ అంశంపై శాసనం చేయడానికి ఎంతో సందేహించేవారు నెహ్రూ హయాంలో ప్రభుత్వ నేతలు. ప్రతిపక్ష నేతలను పిల్చి, ఒప్పించి, వారి అభిప్రాయాలు పరిగణనకు తీసుకుని, ఆ తర్వాత ఆ అంశంపై నిర్ణయం చేసేవారు. అటువంటిది సభలో మూడోవంతు మంది సభ్యులు సభకు రానప్పుడు సభ జరపడమే ప్రజాస్వామ్య సూత్రాలకు భంగకరం; ఏకపక్షంగా చర్చలు, నిర్ణయాలు చేయడం నియంతృత్వం తప్ప వేరు కాదు. సభలో మెజార్టీ వున్నంత మాత్రాన సభ మొత్తం వారి పార్టీ సమావేశ మందిరంగా మార్చుకోవడానికి రాజ్యాంగం సమ్మతించదు. ఈ ప్రమాదాన్ని అరికట్ట వల్సిన బాధ్యతను రాజ్యాంగ నిర్మాతలు స్పీకర్‌పై పెట్టారు. కాని ఆంధ్ర శాసనసభ స్పీకర్ గారు తన రాజ్యాంగ ధర్మాన్ని నిస్సంకోచంగా ఉల్లంఘిస్తున్నారు.

ప్రభుత్వ ప్రయోజనాలు, పార్టీ రాజకీయాలకు అనుగుణంగా స్పీకర్ వ్యవహరించడం వల్ల జరిగే నష్టం కేవలం స్పీకర్ పదవి హూందా తనానికి మాత్రం పరిమితం కాదు; అది శాసనసభల పట్ల ప్రజల విశ్వాసం కోల్పోయే పరిస్థితికి దారి తీస్తుంది. ప్రతిభా భారతి గారు ఈ వాస్తవాన్ని ఎంత త్వరగా గుర్తిస్తే ఆమెకు, శాసన సభ ఉనికికి కూడా అంత మంచిది.

ఇప్పటికైనా తన తప్పు తెలుసుకుని ఆమె శాసనసభను రాజ్యాంగ బద్ధంగా నిర్వహించడానికి ప్రయత్నించడం, తాను పక్షపాత ధోరణితో వ్యవస్తున్నానని వస్తున్న విమర్శలు తిరిగి తలెత్తకుండా నిష్పక్షపాత వైఖరి అవలంభించడం అవసరం. ఈ కృషిలో లోపం వస్తే మాత్రం ఆమెను చరిత్ర క్షమించదు. *

జమీన్‌రైతు

## జమీన్‌రైతు

25.8.50

వెల: 0-3-0 పేజీలు: 12

### పెన్నానది వంతెనకు ప్రారంభోత్సవం

పెన్న (బ్రిడ్జి లాంఛన ప్రాయపు నిర్మాణ ప్రారంభోత్సవం 20తేది పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ ఎం. భక్తవత్సలం గారిచే జరుపబడింది. ఈ ప్రారంభోత్సవ సమావేశానికి ఆర్థిక మంత్రి శ్రీ గోపాల రెడ్డిగారు అధ్యక్షత వహించారు. హైవేస్ సూపరింటెండింగు ఇంజనీరు తిరుమలయ్యంగార్ గారు ఆధ్వరం వహించారు.

సభాధ్యక్షుడు గోపాలరెడ్డి గారు వుపన్యసిస్తూ, పెన్న బ్రిడ్జి లేనందువల్ల నెల్లూరు అనుభవిస్తున్న యిబ్బందులను వివరించి, ఏలాటి ఆందోళన, ఆర్భాటం లేకుండా ఈ బ్రిడ్జి ఇప్పుడు చురుకుగా సాగుతుండడం చూస్తే, దేనికి గాని ఒక తరుణం కావలసినట్లు కనపడుతున్నదని, అలాటి తరుణమే ఈ బ్రిడ్జికి ఇప్పుడు వచ్చిందన్నారు.

150 సంవత్సరాల బ్రిటీష్ ప్రభుత్వ అధికారంలో జరిగిన పనులు, యీ నాలుగు సంవత్సరాలలో కాంగ్రెస్ ప్రభుత్వం నెరవేర్చిన ప్రజా సౌకర్యాలను వివరిస్తూ ఇటీవల నిర్మించబడ్డ మెటటూరు డ్యాంతో సహా, బ్రిటీష్ ప్రభుత్వం మనరాష్ట్రంలో ఇరిగేషన్ సౌకర్యాల క్రింద 18కోట్ల రూపాయలు మాత్రం ఖర్చు బెట్టిందని, కాంగ్రెస్ ప్రభుత్వం యీ నాలుగు సంవత్సరాలలో 13కోట్ల 11లక్షలు ఖర్చు పెట్టిందని, 30కోట్లు శాంక్షన్ చేసిందని, ఎలక్ట్రిసిటీ క్రింద 14కోట్ల 34లక్షలు వెచ్చించిందని; రోడ్ల నిర్మాణం క్రింద 13 కోట్ల 90లక్షలు ఖర్చు పెట్టిందని, యివిగాక మద్య నిషేధం, జమీన్‌దారీల రద్దు ప్రవేశపెట్టిందని, బ్రిటీష్ ప్రభుత్వం ప్రజాసౌకర్యాలను దృష్టిలోవె పెట్టుకోలేదని అందువల్ల ఆ ప్రభుత్వం పోయినందువల్ల ఎవ్వరూ వగవలసిన అవసరం లేదనిరి.

మన జిల్లాకు సంబంధించి పెన్నారు బ్రిడ్జి, థర్మల్ స్టేషన్ వచ్చాయని, అక్టోబర్ 2తేది టి.బి. హాస్పిటల్‌కు శంఖుస్థాపన మహోత్సవం జరుగబోతున్నదని, యిక మన జిల్లాకు జరుగవలసిన వాటిలో కృష్ణ ప్రాజెక్టు మిగిలివున్నదన్నారు.

### నెల్లూరులో గాంధీజి విగ్రహ ప్రతిష్టాపన

గాంధీ శిలావిగ్రహ ప్రతిష్టాపనోత్సవం 20తేది సాయంకాలం మంత్రి భక్తవత్సలం గారి అధ్యక్షతన అత్యంతోత్సాహంతో జరిగింది.

తరువ 10వ పేజీలో

## జనవాణి

# నిరుద్యోగ అయ్యోర్లతో ఆటలాడతారా?

టీచర్స్ రిక్రూట్‌మెంట్ టెస్ట్‌కు దరఖాస్తు చేసుకొన్న నిరుద్యోగులతో విద్యాశాఖాధికారులు ఆటాడుకొన్నారు. అప్లికేషన్ ఫారం వంద రూపాయలుగా పెట్టి దానిలో చిన్న రుద్దివేత వుండినా తీసుకోలేదు. అప్లికేషన్‌లో బ్లాక్ అండ్ వైట్ ఫోటోలు అంటించాలన్నది మరో తలతిక్క నిబంధన. కలర్ ఫోటోల కాలంలో .నిరుద్యోగులందరూ డబ్బులు వెచ్చించి బ్లాక్ అండ్‌వైట్ ఫోటోలు మళ్లీ తీయించుకోలేక తప్పలేదు. అప్లికేషన్‌లో జతపర్చిన జెరాక్స్ కాపీలను తప్పనిసరిగా అటెస్టేషన్ చేయించాలన్నది మరో నిబంధన. అప్లికేషన్ తీసుకొనే సమయంలో ఒరిజినల్స్ అన్నీ చూస్తున్నప్పుడు మళ్లీ అటెస్టేషన్ ఎందుకో? ఇవన్నీ ఒక ఎత్తైతే హాల్ టిక్కెట్లు జారీ అబందరగా తయారయ్యింది. హాల్ టిక్కెట్లను పరీక్షలకు వారం ముందుగా పోస్ట్‌లో పంపుతున్నామన్న విద్యాశాఖాధికారులు చివరి దశలో చేతులెత్తేశారు. మళ్లీ వీటిని తెచ్చుకొను నిరుద్యోగులు వ్యయప్రయాసలకు లోనుకావాల్సి వచ్చింది. ఉద్యోగం సంగతి ఎటున్నా దరఖాస్తుచేసి హాల్‌టిక్కెట్లు పొందేందుకు నిరుద్యోగుల తలప్రాణం తోకకొచ్చింది.

నెల్లూరు వి. కార్యాణి

### మునిసిపల్ అధికారులు ఏం చేస్తున్నట్లు?

5లక్షలు జనాభాగల నెల్లూరు మునిసిపాలిటీ పరిధిలో అధికారికంగా 18వేల కొళాయిల కనెక్షన్లు మాత్రమే వున్నాయంటే ఆశ్చర్యం కల్గుతుంది. టౌన్‌లో దరిదాపుల లక్ష ఇళ్లుంటాయి. వీటిలో 50శాతం తీసేసినా మరో 50 శాతం ఇళ్లలో కొళాయిలు వున్నాయి. కాని ఇవన్నీ మునిసిపల్ వాటర్ వర్క్సు శాఖలో పని చేసే వాళ్లు వేసి, లక్షాధికారులై పోయారు. మునిసిపాలిటీ మాత్రం ఉద్యోగులకు జీతాలివ్వక, కాంట్రాక్టర్లకు బిల్లులు చెల్లించక, కరెంటు బిల్లులు కట్టక అప్పుల ఊబిలో కూరకపోయింది. దీనికంతటికి పరిపాలన చేతకాని అధికారులే కారణమనాలి. వీరికి వేలకు వేలు జీతాలు చెల్లించడమెందుకో?

నెల్లూరు వి. రమణయ్య

### దోమలు బాబోయ్ దోమలు

నెల్లూరు టౌన్‌లో దోమల బాధ

తరువ 10వ పేజీలో

# కొత్త కలెక్టర్ కరుకు- అధికారుల్లో బెరుకు!

కొత్త కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ కరుకుగానే కనిపిస్తున్నారు. కలెక్టరేట్‌లో అన్ని విభాగాలను ప్రక్షాళన చేసే కార్యక్రమాన్ని యుద్ధ ప్రాతిపదికన చేస్తున్నారు. అంతరంగిక సిబ్బందితో మొదలైన శుద్ధి కార్యక్రమాన్ని త్వరలో కొన్ని

**కలెక్టరేట్‌లో సంస్కరణలు**

విభాగాల్లో డిప్యూటేషన్‌పై కొనసాగుతున్న అధికారుల వరకు విస్తరించబోతున్నారు.

అధికార్లతో 'బాతాఖానీ' సాంప్రదాయానికి పూర్తిగా ఫుల్‌స్టాప్ పెట్టేశారు. ఏ శాఖకు సంబంధించిన ఫైల్ అయినా అధికారులు తన వద్దకు నేరుగా తీసుకరావద్దని ఆదేశాలు జారీ చేశారట. పరిపాలనా పద్ధతులకు అనుగుణంగానే ఫైల్స్ తన వద్దకు రావాలని ఖచ్చితంగా ఆదేశాలు ఇచ్చేశాడు. ఫైళ్ల మీద సంతకాల కోసం అనవసరంగా తన వద్దకు రావద్దని చెప్పారట.

ప్రజలు ఇచ్చే ప్రతి ఒక్క అర్జీని జెరాక్స్ తీసి, నకలు తన వద్ద ఉంచుకొని, ఒరిజినల్ కాపీని సంబంధిత శాఖలకు, లేదా మండలాలకు సంబంధించినది అయితే మండల స్థాయి అధికార్లకు పంపుతున్నారట. అర్జీలకు సంబంధించిన జెరాక్స్ నకలు కాపీలను, శాఖలు, మండలాల వారీగా ఫైల్లు తయారు చేసి, వారానికొకరోజు, వాటిపై తీసుకున్న చర్యలపై అధికార్లను ప్రశ్నిస్తున్నారు.

గత కలెక్టర్ హయాంలో పని లేకుండా పోయిన డిఆర్‌ఓకు ఇప్పుడు చేతినిండా పని కల్పించాడు. మండలాల్లో ఆకస్మిక తనిఖీలు కూడా చేస్తున్నారు. మొత్తం మీద కొత్త కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ కలెక్టరేట్‌లో చేపట్టిన సంస్కరణల గురించి కథలు, కథలుగా చెప్పుకుంటున్నారు. ఈ ధోరణి, కొత్త

తరువాయి 11వ పేజీలో

రవి-చిన్నపిల్లల ఆసుపత్రిలో ఐ.యు.ఎం.సి.యు. ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న ఎస్వీ డాక్టర్ రాజేశ్వరమ్మ, వేదికపై సంస్థ యం.డి. వసంతలక్ష్మి, చిన్నపిల్లల డాక్టర్ రవికుమార్, ప్రముఖ న్యూరాలజిస్టు డాక్టర్ పాండ్యన్.

# జూనియర్ అధ్యక్షత సీనియర్ల నిరాసక్తత

నెల్లూరు జిల్లా తెలుగుదేశం పార్టీ రాజకీయాలు ఎప్పుడు ఎలా మలుపు తిరుగుతాయో తెలియని స్థితి నెలకొని వుంది. ఎవరేం చేస్తున్నారో, ఎందుకు చేస్తున్నారో తెలియని అయోమయం

**జిల్లా టిడిపి సమావేశం తీరు**

పరిస్థితిలో కార్యకర్తలు కొట్టుమిట్టాడుతున్నారు. మంగళవారం నాడు జరిగిన జిల్లా తెలుగుదేశం పార్టీ సర్వ సభ్య సమావేశమే ఇందుకు నిదర్శనం. జిల్లా పార్టీ అధ్యక్షుడు, ఉదయగిరి ఎమ్మెల్యే అయిన విజయరామిరెడ్డి హైదరాబాద్‌లో ఉన్నందువల్ల జిల్లా కమిటీ సమావేశాన్ని ఏర్పాటు చేసి, దానికి అధ్యక్షత వహించాల్సిందిగా జిల్లా తెలుగు యువత మాజీ అధ్యక్షుడు, కౌన్సిలర్ అయిన ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డిని కోరారు. విద్యుత్ ఛార్జీల పెంపును సమర్థిస్తూ కార్యకర్తలకు వివరించేందుకు సమావేశం ఏర్పాటు చేశారు. జిల్లాలో పార్టీ సీనియర్ నాయకులు అనేక మంది ఉండగా, శ్రీధర కృష్ణారెడ్డిని ఎందుకు సమావేశానికి అధ్యక్షత వహించమన్నారన్నది పార్టీ వర్గాల్లో చర్చనీయాంశమైంది. దాదాపు 30 మంది వరకు హాజరైన ఈ సమావేశంలో రాపూరు

తరువాయి 11వ పేజీలో

పెంచిన విద్యుత్ ఛార్జీలకు నిరసనగా రాష్ట్ర శాసనసభ్యులు హైదరాబాదులో చేపట్టిన నిరాహారదీక్ష శిబిరంలో నెల్లూరు, రాపూరు ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డిలతో సమీక్షిస్తున్న సిఎల్‌పి నేత వైఎస్. రాజశేఖర్ రెడ్డి

# ఆదాల 'పాక' వద్ద తాళ్లపాక పడిగాపులు

నెల్లూరు మున్సిపల్ రాజకీయాలు కప్పల తక్కెడ మాదిరి తయారయ్యాయి. ఏ వర్గం ఎప్పుడు ఎటు తిరుగుతుందో, ఏ రాజకీయ పార్టీ ఎప్పుడు ఎవరితో స్నేహం కడతారో మానవ మాత్రుడికి తెలియని వ్యవహారంగా తయారైంది. మున్సిపల్ రాజకీయాల్లో ఇంత దిగజారుడు తనం, అయోమయం, అనిశ్చితి ఇటీవల కాలంలో ఎప్పుడూ లేదు.

నిన్నమొన్నటి వరకు మంత్రి ఆదాలను అనరాని మాటలతో తిట్టిపోసి, తొడకొట్టి సవాల్ చేసిన రమేష్‌రెడ్డి, ఇప్పుడు ఆదాలను ప్రసన్నం చేసుకొనేందుకు ఆయన వాకిట ముందు పడిగాపులు కాస్తున్నాడు. రెండు దఫాలు ఆదాల ఇంటికి వెళ్లి మాట్లాడేందుకు ప్రయత్నించినా, మంత్రి రమేష్‌రెడ్డి ముఖం చూసేందుకు కూడా నిరాకరించడంతో, పట్టువదలని విక్రమార్కుడు మాదిరి నిరాశ చెందకుండా, ఆదాలకు - తనకు రాజీ కుదర్చమని కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నను శరణు జొచ్చాడు. నువ్వు సోమిరెడ్డితో జతకట్టావు కాబట్టి నిన్ను మోయడం నా తరం కాదని ప్రసన్న చేతులెత్తేశాడు. ఆ తర్వాత మంత్రికి సన్నిహితులైన వారి ద్వారా రాయబారం నడిపినా, రాజీ ప్రయత్నాలు మాత్రం ఒక్క అంగుళం కూడా కదల లేదు. ముఖ్యమంత్రికి ఇష్టం లేకున్నా, తానే అనూరాధకు పార్టీ టిక్కెట్ ఇప్పించి, 12లక్షలు సహాయం చేసినా, నామినేషన్ గడువు ముగిసిన మరునటి

**రోజుకో విధంగా రంగుమారుతున్న కౌన్సిల్ రాజకీయాలు**

రోజు నుంచే తనను అసభ్యం గా తిట్టిన రమేష్‌రెడ్డితో, ముఖ్యమంత్రి చెప్పినా రాజీపడనని ఆదాల చెబుతున్నారట. రమేష్‌రెడ్డి తీరు ఇలా ఉంటే కౌన్సిల్‌లో పార్టీల తీరు మరోలా ఉంది.

ఈ నెల 19న జరిగిన వార్డు కమిటీ ఛైర్మన్ ఎన్నికల్లో బిజెపికి ఒక వార్డు కమిటీని కాంగ్రెస్ పార్టీ దానం చేసింది. మున్సిపాలిటీలో తెలుగుదేశంతో జతకట్టిన బిజెపి వార్డు కమిటీ ఎన్నికలో చ్చేసరికి ఐదోజోన్ ఛైర్మన్ పదవి విషయంలో కాంగ్రెస్‌ను ఆశ్రయించింది. ఈ జోన్‌లో కాంగ్రెస్‌కు 2, బిజెపి, సిపిఎం, తెలుగుదేశంకు ఒక్కొక్కటి స్థానాలున్నాయి. మూడోవార్డు కమిటీలో తెలుగుదేశం మద్దతుతో బిజెపి ఎన్నికయ్యే అవకాశం ఉన్నప్పటికీ, దీన్ని 14వార్డు తెలుగుదేశం కౌన్సిలర్ బాషాకు ఇవ్వాలని నిర్ణయించడంతో నష్టపరిహారంగా కాంగ్రెస్ పార్టీ అండదండలతో బిజెపికి, ఐదో జోన్ కమిటీ దానం చేశారు. వార్డు కమిటీ ఎన్నికలను సిపిఎం కౌన్సిలర్లు బహిష్కరించారు. వైస్ ఛైర్మన్ ఎన్నికలోనూ మైనారిటీ కోఆప్షన్ సభ్యుడి ఎన్నికలోనూ కాంగ్రెస్‌తో జతకట్టి వార్డు కమిటీ ఎన్నికల్లో దుమ్మా కొట్టేశారు. వార్డు కమిటీల ఎన్నికలకు ముందే 12వ తేదీ జరిగిన మున్సిపల్ అత్యవసర సమావేశంలో సిపిఎంతో కలసి బిజెపి కౌన్సిలర్లు సమావేశానికి కోరం పూర్తి చేశారు.

పట్టణంలో మంచినీటి సమస్యపై చర్చించేందుకు మున్సిపల్ అత్యవసర సమావేశానికి మొదట కాంగ్రెస్ కౌన్సిలర్లు

తరువాయి 11వ పేజీలో

# విద్యుత్ ఉద్యమానికి సి.పి.ఎం. ఊపిరి

విద్యుత్ ఛార్జీల పెంపులకు నిరసనగా నెల్లూరు జిల్లాలో ప్రజా ఉద్యమానికి, వ్యవస్థీకృతమైన నిరసన కార్యక్రమాలకు సిపిఎం పార్టీ ఊపిరి పోసింది.

గత రెండు నెలలుగా జిల్లాలో సాగుతున్న ఈ ఉద్యమంలో సిపిఎంతో సమంగా, నెల్లూరు, రాపూరు ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి వినూత్న రీతులలో ఆందోళనా కార్యక్రమాలు చేపట్టినా, నెల్లూరు పట్టణంలో 15 రోజులుగా సిపిఎం చేస్తున్న బిల్లుల చెల్లింపు నిరాకరణ ఉద్యమం మాత్రం ప్రశంసనీయమైన రీతిలో కొనసాగుతూంది. ఉపన్యాసాలు, నినాదాలకే పరిమితం కాకుండా, ఆ పార్టీ కార్యకర్తలు, బిల్లుల చెల్లింపు కేంద్రాల వద్ద బైఠాయించారు. ఉదయం 8 గంటల నుంచి మధ్యాహ్నం ఒంటి గంట వరకు సిపిఎం కార్యకర్తలు జోన్‌లోని అన్ని బిల్లుల వసూలు కేంద్రాల వద్ద గేట్‌లకు అడ్డంగా కూర్చొంటున్నారు. బిల్లు కట్టేందుకు వస్తున్న వారికి నచ్చజెప్పి, తిప్పి పంపేస్తున్నారు. ఎంతో క్రమశిక్షణతో, అంకిత భావంతో సిపిఎం ఇటీవల కాలంలో జిల్లాలో ఇంత పకడ్బందీగా ఏ ఉద్యమం కూడా నిర్వహించలేదు. గూడూరు, కావలి, సూళ్లూరుపేట, ముత్తుకూరు, ఆత్మకూరు తదితర ప్రాంతాల్లో కూడా సిపిఎం ఇదే విధంగా బిల్లుల చెల్లింపు సహాయ నిరాకరణ ఉద్యమాన్ని చేపట్టి విజయవంతంగా నిర్వహిస్తోంది. అధికారిక లెక్కల ప్రకారమే జిల్లాలో ఇప్పటి వరకు 80శాతం బిల్లులు వసూలు కాలేదని చెబుతున్నారు.

హైదరాబాద్‌లో కాంగ్రెస్ ఎమ్మెల్యేల నిరాహార దీక్ష ప్రారంభం అయిన తర్వాత, నెల్లూరులో రిలే నిరాహార దీక్షల పేరుతో, కాంగ్రెస్ నేతలు, తిరిగే పనిలేకుండా వళ్లు అలవకుండా మైకులు అదరగొట్టి ఉపన్యాసాలు చేస్తున్నారు. ఒక్క రోజు మాత్రం ఆనం జయకుమార్‌రెడ్డి నాయకత్వంలో, నాలుగైదు బిల్లుల వసూలు కేంద్రాల వద్ద ప్రజలకు నచ్చజెప్పే కార్యక్రమం చేపట్టారు. జిల్లాలోని ఇతర నియోజక వర్గాల్లో కాంగ్రెస్ మాజీలు, విద్యుత్ ఛార్జీలపై పత్రికా ప్రకటనలు, ఉపన్యాసాలకే పరిమితమై పోయారు. కాగల కార్యం గంధర్వులు తీర్చినట్టు చేసే రభస ఏదో, వామపక్షాలు చేస్తున్నాయి కదా, మధ్యలో మనకెందుకీ అవస్థ అనుకున్నారేమో పాపం, మడత నలగకుండా, కూర్చొన్న చోట నుంచి కదలకుండా ఉద్యమం చేస్తున్నారు. *

# పెన్నలో నిశ్శబ్ద జలప్రళయం

సోమశిలకు ఎగువ ప్రాంతాలైన కడప, కర్నూలు జిల్లాల్లో కురిసిన భారీ వర్షాలు, నెల్లూరు జిల్లాలో నిశ్శబ్ద జల ప్రళయాన్ని సృష్టించాయి. పెన్నకు గురువారం నాడు ఆకస్మికంగా వరదనీరు రావడంతో ఆరుగురు చనిపోయారు. చేజర్ల మండలం కోటి తీర్థం గ్రామంలో పెన్నలో బట్టలు ఉతుక్కుంటున్న నలుగురు మహిళలు, వనమ్మ, లక్ష్మమ్మ,

## ఆరుగురి మృతి

జయమ్మ, లక్ష్మి వరదకు కొట్టుకు పోయి మరణించారు. విరువూరుకు చెందిన అహ్మద్‌బాషా, ఆయన భార్య కూడా పెన్న నీటిలో కొట్టుకుపోయి మరణించారు.

చేజర్ల, విరువూరు, ఆత్మకూరు మండలాల్లో ఆరుగురు వ్యక్తులు వరద నీళ్లలో చిక్కుకు పోయి, చెట్లు, గుట్టలపై ఉన్నారు. వారిని రక్షించేందుకు జిల్లా కలెక్టర్ సహాయక బృందాలను తరలించారు.

గురువారం నాడు సోమశిల నుంచి ఆకస్మికంగా ఇంజనీర్లు రెండు లక్షల క్యూసెక్కుల నీటిని పెన్నకు వదిలారు. ఎగువ ప్రాంతం నుంచి నీటి ప్రవాహం ఉధృతి పెరగడంతో డ్యాం గేట్లు అన్నింటిని ఎత్తివేశారు. వరదనీటి విడుదలలో ఇంజనీర్ల నిర్లక్ష్యం వల్లనే ఆరుగురు వ్యక్తులు నీళ్లలో కొట్టుకు పోయారని చెబుతున్నారు. కడప, కర్నూలు జిల్లాల్లో భారీ వర్షాలు కురుస్తున్నాయని, డ్యాంకు వరద నీరు చేరే అవకాశం వుందని తెలిసి కూడా గురువారం ఉదయం వరకు అధికారులు ఏమీ పట్టనట్లు వ్యవహరించారు. క్రమక్రమంగా నీటి ఉధృతి పెరిగి డ్యాంకు ప్రమాదం ఏర్పడిందని తెలియగానే హడావుడిగా నీటి విడుదల కార్యక్రమాన్ని చేపట్టారు. పెన్నానది పరీవాహక ప్రాంతాల్లో ముందుగా హెచ్చరికలు

తొరువ 8వ పేజీలో



హైదరాబాద్‌లో అమరణ నిరాహారదీక్ష చేస్తున్న ఎమ్మెల్యేలకు మద్దతుగా నెల్లూరు గాంధీబొమ్మ వద్ద మహిళా కాంగ్రెస్ ఆధ్వర్యంలో జరిగిన రిలే నిరాహార దీక్ష శిబిరంలో ప్రసంగిస్తున్న జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, సిటి శేషారెడ్డి, పనల పెంచలయ్య, డాక్టర్ యశోదర, తదితరులు.

# స్త్రీశక్తి జాతికి మహా శక్తి

మహిళల అభ్యున్నతికి రాష్ట్ర ప్రభుత్వం ఇతోధికంగా కృషి చేస్తున్నదని, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ అన్నారు. మహిళలకు సంబంధించిన ఆర్థిక ఉపకరణాలు, అందించడంతోపాటు ఇండ్ల స్థలాల పట్టాలు, దీపం కనెక్షన్లు తదితర కార్యక్రమాలను మహిళల పేరుమీద ఇవ్వడం జరుగుతున్నదని చెప్పారు. స్త్రీ శక్తి మహాశక్తి అని జిల్లా

## జిల్లావార్తలు

కలెక్టర్ పేర్కొన్నారు. శనివారం స్థానిక దర్గామిట్టలోని పినాకిని గ్రామీణ బ్యాంకు ద్వారా స్వయం సహాయక గ్రూపులకు రుణాలను అందజేసే కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. జిల్లాలో ఈ సంవత్సరం మూడువేల గ్రూపులకు ఆర్థిక సహాయం చేయటం లక్ష్యంగా బ్యాంకులు నిర్ణయించారన్నారు. యింతవరకు 1,274 గ్రూపులను గుర్తించి రుణాలు ఇచ్చేందుకు బ్యాంకులు సంసిద్ధత వ్యక్తపరచాయన్నారు. పొదుపులక్ష్మి గ్రూపులు సంవత్సరం పూర్తి చేసుకొని క్రమం తప్పకుండా పొదుపు చేస్తూ నెలసరి సమావేశాలు ఏర్పాటు చేసుకొని అకౌంట్ సక్రమంగా నిర్వహించాలన్నారు. అంతర్గత రుణ సహాయం చేసుకుంటూ పనిచేస్తున్న గ్రూపులకు బ్యాంకులు రుణ సహాయం అంజేస్తాయన్నారు. పొదుపులక్ష్మి కార్యక్రమ పథకాన్ని నెల్లూరు జిల్లాలో మొట్ట మొదటగా ప్రారంభించి రాష్ట్రంలోనే కాక దేశంలోనే ఒక ప్రత్యేక స్థానాన్ని పొందిదన్నారు. ఇదే స్ఫూర్తితో ఈ సంవత్సరం స్వయం సహాయక గ్రూపులు రుణాలను పొంది ఆర్థికాభివృద్ధి చెంది, పూర్వపు స్థితిని పొందాలని కలెక్టర్ ఉద్బోధించారు.

మహిళా సంక్షేమానికి అధిక ప్రాధాన్యత నిచ్చి ప్రభుత్వం ప్రతి కార్యాక్రమంలోనూ మహిళల ప్రాధాన్యతను పెంచుతుందన్నారు. జన్మభూమి, స్వయం సహాయ బృందాలు, దీపం, పొగలేని పొయ్యి వంటి పథకాలలో

తొరువ 12వ పేజీలో

# రాశికాదు విద్యలో వాసి పెరగాలి

భారతదేశంలో విద్యార్థుల పరిమాణం పెరిగిందే తప్ప, విద్యా ప్రమాణాల స్థాయి పెరగలేదని రాష్ట్ర గవర్నర్ రంగరాజన్ అన్నారు. గురువారం నాడు గవర్నర్ కావలి, జవహర్ భారతి కళాశాల స్వర్ణోత్సవ సభలో పాల్గొని ప్రసంగించారు. పలు కోర్సులలో పాత బడ్డ సిలబస్‌ను కాలానుగుణంగా మార్పులు చెయ్యాలని, పరీక్షా విధానంలో సంస్కరణలను చేపట్టాలని, ఆధునిక సాంకేతిక విధానానికి అనుగుణంగా ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చి, బోధనా పద్ధతుల్లో విప్లవాత్మక మార్పులు తీసుకురావాలని గవర్నర్ కోరారు. మానవ వనరుల అభివృద్ధికి విద్య ప్రధాన ఆయుధమని, క్రమశిక్షణ, అంకితభావం కల్గిన యువశక్తి జాతికి తరగని సంపద అని గవర్నర్ అన్నారు. నాణ్యమైన విద్యాప్రమాణాలను రూపొందించడంలో, జవహర్ భారతి కళాశాల వంటి విద్యా సంస్థల పాత్ర ఎంతైనా వుందని చెప్పారు. విద్యా ప్రాముఖ్యతను గుర్తించి, ఒక ఉన్నతమైన ఆశయంతో నడుస్తున్న జవహర్ భారతి కళాశాల స్ఫూర్తి ప్రదాత అని ప్రశంసించారు. గ్రామ ప్రాంతాల్లో విద్యా సుంగధాలను వెదజల్లాలన్న లక్ష్యంతో, వెనుకబడ్డ ప్రాంతమైన కావలిలో జవహర్ భారతి లాంటి మంచి కళాశాలను ఏర్పాటు చేసిన వ్యవస్థాపకుల ముందు చూపుకు వందనమని గవర్నర్ రంగరాజన్ అన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, దొడ్ల రామచంద్రా రెడ్డి, రిటైర్డ్ ఐఎఎస్ అధికారి శంకరన్, వెంకటేశ్వర యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ కె. ఇనాక్, హైకోర్టు జడ్జి పి. వెంకట్రామి రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## భూముల కబ్జాపై ఎమ్మార్వో వివరణ

మనుబోలు మండలంలోని కండలేరు పరీవాహక ప్రాంతంలో రొయ్యల సాగుకు తాము ఎవరికీ పట్టాలు ఇవ్వడం లేదని ఎమ్మార్వో వివరణ పంపారు.

కొలనుకుదురు గ్రామంలో 1996-98 సంవత్సరంలో 960 ఎకరాలు డిఫారం పట్టాలను, ఒక్కొక్కరికి రెండు నుంచి రెండున్నర ఎకరాలు ఇచ్చారని చెప్పారు. అయితే డిఫారం పట్టాలలో నిబంధనలను ఉల్లంఘించి రొయ్యల

## గవర్నర్ ఉద్బోధ

గుంటలు చేసిన 12 మందిపై కేసులు పెట్టామన్నారు. కట్టువపల్లి, కొలనుకుదురు గ్రామాలలో 521 సర్వే నంబర్ భూమిలో ఎవరూ ప్రవేశించకుండా 145వ సెక్షన్ అమలులో ఉందన్నారు. కొలనుకుదురు గ్రామంలో అక్రమంగా రొయ్యలసాగు చేసుకొంటున్న 73 మందిపై కేసులు పెట్టమని ఎస్ఐని కోరామన్నారు. 1998 తర్వాత బద్దెవోలు, వెంకన్నపాళెం, పిడూరు, కట్టువపల్లి గ్రామాల్లో పట్టాలు ఇవ్వలేదని, పట్టాలు ఇచ్చేందుకే అవకాశం లేనప్పుడు, డబ్బులు ఎలా వసూలు చేస్తామని ఎమ్మార్వో ప్రశ్నించారు - మంచిదేకదా?

## ఉచిత కంటి శిబిరం

పొదలకూరు మండలం మహ్మదాపురం గ్రామంలో ఈ నెల 20న రోటరీ క్లబ్ ఆధ్వర్యంలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం జరిగింది. డాక్టర్ శివప్రతాప్‌రెడ్డి ఆధ్వర్యంలో 150 మందికి కంటి పరీక్షలు నిర్వహించారు. వారిలో 20 మందికి ఉచితంగా కంటి ఆపరేషన్లు చేశారు. 70 మందికి కంటి అద్దాలు పంపిణీ చేశారు. దొడ్ల సుబ్బారెడ్డి ఈ కార్యక్రమానికి ఆర్థిక సహాయం చేశారు.

## చెరువు భూమి స్వాహా

దుత్తలూరు మండలం సోమల రేగడ గ్రామంలో చెరువు దురాక్రమణల పాలవుతుంది. శ్రీకృష్ణదేవరాయల కాలంలో నిర్మించిన ఈ చెరువు 245 ఎకరాల విస్తీర్ణం కలిగి ఉంది.

ఇటీవల కొందరు పెత్తందార్లు ఎమ్మార్వో, విఏఓల సహకారంతో చెరువులో 15ఎకరాలను ఆక్రమించారు. సాగుకు అనుకూలంగా ఉండేందుకు ప్రొక్లయిన్‌తో చెరువు కట్టను కూడా తొలగించారు. గ్రామస్తులు ఇదేం అన్యాయమని నిలదీస్తే, మీదిక్కున్న చోట చెప్పుకొండని బెదరిస్తున్నారట.

## జోనల్ వ్యవసాయ సమావేశం

వ్యవసాయ విద్యాలయ శాస్త్రవేత్తలు, వ్యవసాయ అధికారులు వ్యవసాయ రంగంలో మారుతున్న సాంకేతిక విజ్ఞా

తొరువ 8వ పేజీలో

## తాగుబోతు కౌన్సిలర్లు

నెల్లూరు మున్సిపల్ కౌన్సిల్ సమావేశాలు జరుగుతున్న సమయంలో కొందరు కౌన్సిలర్ల తీరు చూస్తుంటే అసహ్యమేస్తోంది. కౌన్సిలర్లుగా మన మెన్నుకున్న మన ప్రతినిధులు కొందరు పీకలదాకా తాగి కౌన్సిల్ సమావేశాలకు హాజరవుతున్నారు. బోడిగాడితోటలో పేరుకు పోయిన కంపోస్టులోనో, డ్రైనేజి కాలువల్లోనో పొర్లాడే పందులకంటే హీనాతిహీనంగా ప్రవర్తిస్తున్నారు. నెలకొకసారి జరిగే కౌన్సిల్ సమావేశాలకు హాజరై, ప్రజా సమస్యలపై హుందాగా చర్చించి, తమను ఎన్నుకొన్న ప్రజల గౌరవాన్ని నిలబెట్టాల్సిన వారే, సమావే శానికి ముందే బాగా తాగి తూలు తున్నారు. ఇదీ చాలదన్నట్టు సమావేశం జరుగుతుండగానే, మధ్య మధ్యలో బయటకొచ్చి, జేబులోంచి బాటిల్‌తీసి, రెండు మూడు పెగ్గులు కొట్టి కౌన్సిల్ హాల్‌లోకి వస్తున్నారు. తెలుగుదేశం పార్టీకి చెందిన ఇద్దరు, కాంగ్రెస్‌కు చెందిన ఒక కౌన్సిలర్ మందు కిక్కులేనిదే నోటమాట రావడంలేదని చెబుతున్నారట. ఇటీవల ఒకరోజు కురచగా ఉండే కౌన్సిలర్ మహాశయుడు, అందరూ చూస్తుండగానే చికెన్ పకోడా అమ్మే తోపుడు బండి ప్రక్కనే, డిస్పోజబుల్ గ్లాస్‌లో మందు పోసుకొని తాగుతూ కనిపించాడు. ఇటువంటి దగుల్బాజీలను ఓటేసి ప్రతినిధులుగా ఎన్నకున్నందుకు సిగ్గుతో మనమే తలదించుకోవాల్సిన దుస్థితి. కౌన్సిలర్లలో ఇంత దౌర్భాగ్యపు పరిస్థితి గతంలో ఎప్పుడూ లేదు. తాగుబోతు కౌన్సిలర్లు ఉన్నా, అదేదో చాటుమాటుగా జరిగేది. తాగి కౌన్సిల్‌కు రావడమనే సాంప్రదాయం ఇప్పుడే కనపడుతోంది. ఈ దఫా ఇటువంటి తాగుబోతు కౌన్సిలర్లను, వారి సహచరులే తన్ని తగలేస్తే కొద్దోగొప్పో మిగిలి ఉన్న కౌన్సిల్ పరువు కాపాడిన వారవుతారు. లేదంటే వాళ్లతో పాటే మిగిలిన వాళ్లూ చరిత్రహీనులుగా నిలిచిపోతారు.

## స్టంట్ మాస్టర్ కమిషనర్ వేమారెడ్డి

మున్సిపల్ కమిషనర్ వేమారెడ్డి గారికి ఫైటింగ్ సీన్లంటే మహా ఇష్టం ఉన్నట్టుంది. తగాదా లేకుంటే ఆయనకు పూటగడవదు. కొట్లాటకు దిగనిదే పొద్దుపోదు. మొత్తం మీద నెల్లూరు చరిత్రలో ఇటువంటి స్టంట్ మాస్టర్ కమిషనర్‌గా గతంలో ఎవరూ పనిచేయ లేదు.

మొన్నీ మధ్య కోటమిట్ట ప్రాంతంలో దొంగ కొళాయి కోసం గుంటలు తవ్వుతున్నారని తెలిసి, కమిషనర్ స్వయంగా అక్కడకుపోయి, ఆ ప్రాంత వాసులతో తగాదాపడి, పరస్పరం చొక్కాలు పట్టుకొని కొట్టుకొన్నారట. మున్సిపల్ సిబ్బంది జోక్యం చేసుకొని కొట్లాటకు దిగిన కమిషనర్‌ను వెనక్కి తీసుకొచ్చేశారు. మరుసటి రోజే టీచర్స్ యూనియన్ నాయకుడొకరితో ఆఫీసులోనే ఫైటింగ్ సీను సృష్టించారట. ఆ టీచర్స్ యూనియన్ నాయకుడు సిబ్బందికి తెలియకుండా దొంగతనంగా రెండు ఫైళ్లు తీసుకెళ్లాడని కమిషనర్ పోలీసులకు ఫిర్యాదు చేశారు. దీనిపై ఇద్దరి మధ్య గొడవ జరిగి, కమిషనర్ ఆఫీసుకాస్తా యుద్ధభూమిగా మారింది. కమిషనర్, కౌన్సిలర్ల కయ్యాలు - వియ్యాల సంగతి సరేసరి. అవి రోజు వారీ పోప పూజల మాదిరి క్రమం తప్పకుండా జరుగుతూనే వుంటాయి.

## చల్లబడ్డ నెల్లూరు

వర్షా కాలంలో కూడా వేసవి తాపాన్ని అనుభవించిన నెల్లూరు ప్రజలకు సోమ, మంగళ వారాల్లో కురిసిన వర్షాలు కొద్దిగా ఊరటనిచ్చాయి. జిల్లా మొత్తం మీద 110 సెంటిమీటర్ల వాన పడింది. నెల్లూరు 50 మిల్లీ మీటర్ల వర్షపాతం నమోదైంది. వర్షాల పుణ్యమా అని వాతావరణం చల్లపడటంతో జనం ఊపిరి పీల్చుకున్నారు.

## నెల్లూరులో చీకటి రాత్రి

విద్యుత్ ఛార్జీల పెంపుదలకు నిరసనగా వామపక్షాలు - కాంగ్రెస్ పార్టీల ఆధ్వర్యంలో గురువారం రాత్రి నెల్లూరులో జరిగిన బిజిలీ బంద్ విజయవంతమైంది. రాత్రి ఏడు గంటల నుంచి ఎనిమిది గంటల వరకు ప్రజలు స్వచ్ఛందంగా తమ ఇళ్లలోని లైట్లను ఆర్పివేసి నిరసన ప్రకటించారు. పట్టణంలో పలు దుకాణాలు, హోటళ్లు కూడా స్వచ్ఛందంగా దీపాలను ఆర్పివేశారు.

## గవర్నర్ రాక

రాష్ట్ర గవర్నర్ సి. రంగరాజన్ గురువారం నెల్లూరు పర్యటనకు దిగిన తర్వాత, కావలికి వెళ్లి, విశ్వోదయ కళాశాల ఉత్సవాల్లో పాల్గొన్నారు. అనంతరం నెల్లూరు తిరిగొచ్చి రెడ్‌క్రాస్ సంస్థ ఏర్పాటు చేసిన సమావేశంలో పాల్గొన్నారు. ఆయన వెంట భార్య హరిప్రియ కూడా వున్నారు. గురువారం రాత్రి రైలెక్కి హైద్రాబాద్ వెళ్లిపోయారు.

## కరెంట్‌పై గవర్నర్‌కు వినతి

రాష్ట్ర ప్రభుత్వం పెంచిన విద్యుత్ ఛార్జీలకు నిరసనగా కాంగ్రెస్, సిపిఎం నాయకులు గవర్నర్ రంగరాజన్‌కు నెల్లూరులో మెమొరాండం ఇచ్చారు. గవర్నర్‌ను కలిసిన వారిలో సి.వి. శేషారెడ్డి, సందానీబాషా, ఆనం జయకుమార్ రెడ్డి, పముజుల దశయ్య, గునుపాటి రామచంద్రయ్య, ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, దేవకుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి తదితరులు ఉన్నారు.

## వనమిత్ర హరిప్రసాద్

ప్రతిష్టాకరమైన వనమిత్ర అవార్డు డి.ఎఫ్.ఓ - హరిప్రసాద్‌ను వరించింది. నెల్లూరు డిఆర్‌డిఏలో పనిచేసిన హరిప్రసాద్ ఇప్పుడు తిరుపతిలోని అటవీ పరిశోధనా సంస్థకు బదలీ అయ్యారు.

సికింద్రాబాద్ పెరేడ్ గ్రౌండ్స్‌లో జరిగిన స్వాతంత్ర్యోత్సవ వేడుకల్లో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు హరిప్రసాద్‌కు వనమిత్ర అవార్డును ప్రదానం చేశారు. ఈ అవార్డు క్రింద 50వేల రూపాయల నగదు, బంగారు పతకం, ప్రశంసా పత్రం ఇచ్చారు. రాష్ట్ర స్థాయిలో వనమిత్ర అవార్డుకు ఎంపికైన ఇద్దరు అధికారుల్లో ఆయన ఒకరు.

హరిప్రసాద్ నెల్లూరులో పనిచేసిన సమయంలో ఐదువేల హెక్టార్లలో వనాల పెంపకం చేశారు. 30 చెక్‌డ్యామ్‌లు, 20 ఊట చెరువులు త్రవ్వించారు. 60 గ్రామాల్లో బంజర్లను అభివృద్ధి చేశారు.

## సత్యనారాయణకు ఇండియన్ పోలీస్‌మెడల్

ప్రతిష్టాకరమైన ఇండియన్ పోలీస్ మెడల్‌ను సింగరాయకొండ పోలీస్ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ కె. సత్యనారాయణకు బహుకరించారు. సత్యనారాయణ గతం

తరువాత 7వ పేజీలో

## జిల్లావార్తలు

5వ పేజీ తరువాయి

మహిళలకు పెద్దపీట వేస్తున్నారు. నెల్లూరు జిల్లాలో రెండు లక్షల 36వేల మంది మహిళలు 13వేల 830 గ్రూపులుగా ఏర్పడి 22కోట్ల రూపాయల మేర పొదుపు చేశారన్నారు. బ్యాంకుల నుంచి స్వయం సహాయ గ్రూపుల ద్వారా 1950 పొదుపు లక్ష్మి గ్రూపులకు 7కోట్ల 21లక్షల రూపాయలు రుణసహాయం అందించారన్నారు. దీపం పథకం క్రింద జిల్లాకు కనెక్షన్ల లక్ష్యం కాగా యింతవరకు 26వేలకుపైగా కనెక్షన్లు విడుదల చేశారని, 21వేల 200 కనెక్షన్లు లబ్ధిదారులకు అందచేశారన్నారు.

పినాకిని గ్రామీణ బ్యాంకులు 800 గ్రూపులకు యింత వరకు మూడు కోట్ల రూపాయలు రుణాన్ని అందచేయటం ప్రశంసనీయమని కలెక్టర్ అన్నారు. ఈ సంవత్సరం నెల్లూరు జిల్లాలో 800 గ్రూపులకు రుణాలను ఇవ్వడం పినాకినీ గ్రామీణ బ్యాంకు శాఖలు నిర్ణయించడం హర్షదాయకమన్నారు.

పినాకినీ గ్రామీణ బ్యాంకు ఛైర్మన్ శ్రీహరిప్రసాద్ సభకు అధ్యక్షత వహించి మాట్లాడుతూ సక్రమంగా పనిచేస్తున్న పొదుపులక్ష్మి గ్రూపులను గుర్తించి ముఖ్యమంత్రి సమావేశాలు ఏర్పాటు చేయడంతోపాటు స్వయం సహాయక పథకం గురించి శిక్షణా తరగతులను నిర్వహిస్తున్నామన్నారు.

జాయింట్ కలెక్టర్ పంషేర్ సింగ్ రావత్ మాట్లాడుతూ నెలూరు జిల్లా మహిళలు చైతన్యవంతులై నలుదిశలా పేరు ప్రఖ్యాతులు పొందారని ప్రశంసించారు. స్వయం సహాయక పథకంలో రుణాలను పొంది ఆర్థిక స్తోమతను మెరుగుపరచుకోవాలని హితవు చెప్పారు. ఈ కార్యక్రమంలో 14 పినాకిని గ్రామీణ బ్యాంకు శాఖల ద్వారా 101 గ్రూపులకు 32లక్షల 18వేల రూపాయల చెక్కులను జిల్లా కలెక్టర్ ద్వారా గ్రూపులకు అందజేశారు.

ఈ కార్యక్రమంలో పినాకినీ గ్రామీణ బ్యాంకు జి.ఎం. వై. నరేంద్ర బాబు, నాబార్డు ఎ.ఎం. యం.యస్. మంజునాథన్, సిండికేటు బ్యాంకు యం.డి.యం. శ్రీ బి.గోపినాథ్‌రావు, తదితర బ్యాంకు అధికారులు, పొదుపులక్ష్మి గ్రూపు సభ్యులు, డిఆర్‌డిఎ పి.డి. పద్మావతి, తదితరులు పాల్గొన్నారు.

పాదలకూరులో ఇటీవల జరిగిన రాష్ట్రస్థాయి ఆనం వెంకటరెడ్డి మెమోరియల్ సబ్ జూనియర్ బాల్‌బ్యాడ్మింటన్ పోటీలలో ప్రథమ స్థానం సాధించి ట్రోఫీని గెల్చుకున్న విశాఖ జిల్లా బాలురజట్టు, కృష్ణాజిల్లా బాలికల జట్టు.

## పెండ్లిండ్లు

2వ పేజీ తరువాయి

బాలాజీనగర్‌లో జరిగింది.

### వరప్రసాద్‌రెడ్డి కుమార్తె

శాంతా బయోటెక్ అధినేత, హెపటైటిస్ -బి వ్యాక్సిన్‌ను మనదేశంలో అందరికీ అందుబాటులోకి తెచ్చిన పారిశ్రామికుడు, అందరికి మంచి మిత్రుడు కోదూరు వరప్రసాద్‌రెడ్డి కుమార్తె స్రవంతి, హైదరాబాద్ జి. మదన్ మోహన్‌రెడ్డి కుమారుడు శరత్ వివాహం ఈ నెల 4తేది సికింద్రాబాద్ జువెల్ గార్డెన్స్‌లో అత్యంత వైభవంగా జరిగింది. నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ వధూవరులనాశీర్వదిస్తూ అందరిని పిలిచి మంచి విందునిచ్చారు.

### గూడూరు నిటీ కేబుల్

గూడూరు టౌన్లో కేబుల్ టివి ప్రసారాలు సమర్థవంతంగా నిర్వహిస్తున్న ఔత్సాహిక వ్యాపారి; నిలకడ, నిదానం కల్గిన యువకుడు - మురళి పెండ్లి శైలుతో 11తేది గూడూరు డిఎన్‌ఆర్ కమ్యూనిటీ హాల్‌లో జరిగింది.

### నవయుగం

పనిలేని రాజకీయ వాదులందరికి తన కార్యాలయంలో నీడ కల్పించినా, అన్ని రాజకీయ అభిప్రాయాలు కల్గిన వారిని తన ఎదురుగా కూర్చోబెట్టుకున్నా తాను మాత్రం తామరాకు మీద నీటి బొట్టు వలె గడపగల్గిన చతురుడు; ఆతిథ్యం ఇవ్వడం తప్ప ఆశించడం ఎరుగని మంచి మనిషి, నవయుగం పత్రికను సైతం తన మనస్తత్వానికి తగినట్లే ఎవరినీ నొప్పించకుండా నడిపిన స్వర్గీయ జి. దశరథరామయ్య కుమారుడు లక్ష్మీజీ వివాహం నెల్లూరు, గ్రంథి వెంకట చలమయ్య శ్రేష్టి గారి కుమార్తె ఉషశ్రీతో 6తేది ఉదయం పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది. దశరథరామయ్యగారికి లక్ష్మణుడు వంటి సోదరుడైన నవయుగం కృష్ణమూర్తి తన అన్న లేని లోటు కన్పించకుండా అన్నీ తానై జరిపించాడు పెండ్లి.

### రాపూరు పరిణయం

రాపూరు, నెల్లూరు నాగేశ్వరరావు కుమార్తె నీలిమ జ్యోత్స్న; గూడూరు మంగాపురం బాలసుబ్రహ్మణ్యం గారి కుమారుడు వంశీధర్ వివాహం 4తేది రాపూరులో జరిగింది.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

లో నెల్లూరు, గుంటూరు జిల్లాల్లో పోలీస్ అధికారిగా మంచిపేరు తెచ్చుకున్నారు. గతంలో కూడా సత్యనారాయణ సేవలకు గుర్తింపుగా రాష్ట్ర ప్రభుత్వం పలు సేవా పతకాలను బహూకరించింది. *

## ఛార్జీల శిక్ష

మొదటి పేజీ తరువాయి

వసూలు చేయడం నయం. అందుకే చంద్రబాబు దీనికి సుముఖత చూపలేదు. బిజెపి వారు మరొక ప్రతిపాదన చేయలేదు.

రాజీ రంగం నుంచి వీరు తప్పుకున్న తర్వాత ప్రతిష్టంభన మరింత తీవ్రమై పోయింది. ఇప్పుడు వున్నవి రెండంటే రెండు ద్వారాలు మాత్రమే. చంద్రబాబు తనంత తానుగా ఛార్జీలు తగ్గించడం; లేదా నిరసన వ్రతం పూనివున్న వారు తమంత తాముగా ఇళ్లకు పోవడం. ఇవి రెండు అలివయ్యే మార్గాలు కావు. ఛార్జీలు తగ్గిస్తే చంద్రబాబు రాజకీయంగా బలహీనుడై పోతాడు; దీక్ష విరమిస్తే కాంగ్రెస్, కమ్యూనిస్టులకు రాజకీయ వూపిరి పోస్తున్న ఉద్యమం అంతరించి పోతుంది.

ఏ రూపంలో ఈ ప్రతిష్టంబన తొలగించాలనే ఆలోచన రెండు వర్గాలకు తట్టడం లేదు. అందువల్లే రాష్ట్రంలో రాజకీయ వాతావరణం ఇంత గంభీరంగా తయారు కావడం.

ఆకలికి, అవస్థలకు తాళలేక ఎమ్మెల్యే లందరు జారుకున్నప్పటికీ తాను ఒక్కడినైనా నిరసన కొనసాగించాలని రాజశేఖరరెడ్డి తలపోస్తున్నారు. కమ్యూనిస్టులలో ఇదే పట్టుదల కన్పిస్తున్నది. ఇప్పుడు ఉద్యమాన్ని నీరుగారిస్తే తిరిగి మరొక ప్రజాందోళన చేపట్టడం కష్టమై పోతుందని, ప్రజలలో నమ్మకం సడలుతుందని వీరి అభిప్రాయం. ఆగస్టు 28తేది తలపెట్టిన ఛలో అసెంబ్లీ కార్యక్రమం వరకు వ్రతం నిలపకపోవడం సమంజసమని చాలా మంది ఎమ్మెల్యేలు కూడా భావిస్తున్నారు. ఛలో అసెంబ్లీకి వేల సంఖ్యలో జనాన్ని సమీకరించడానికి వామపక్షాలు సిద్ధమౌతున్నాయి. ఆ జన సమీకరణ చంద్రబాబులో దాగివున్న గుబులు వెలికి తెస్తుందని వీరి ఆశ. దీనికి నక్సలైట్ల సంస్థల నుంచి మద్దతు లభించడం విశేషం. గాయకుడు గద్దర్ నేరుగా నిరసన శిబిరానికి వచ్చి మరీ సంఘీభావం ప్రకటించాడు. పీపుల్స్ వార్ నేతలు పత్రికా ప్రకటనలు చేశారు.

ఉద్యమంలో నక్సలైట్ల ప్రవేశం జరిగితే ఎటువంటి పరిణామాలు సంభవిస్తాయోనన్నది ప్రభుత్వ భయం. అందుకు 28తేది ఈ జన సమీకరణ విఫలం చేయడానికి ఇప్పటి నుంచే ప్రయత్నం ప్రారంభమైంది. రాష్ట్ర వ్యాప్తంగా రైళ్లు, బస్సుల్లో రాజకీయ పార్టీల కార్యకర్తలు ఎక్కకుండా నివారించడానికి పోలీసులను ప్రయోగించ బోతున్నారు. హైదరాబాద్ నగరం ఆ దినం సైనిక శిబిరం వలె తయారు కాబోతున్నది.

వరదల సాకు చూపించి వ్రతం విఫలం చేయడానికి ఒక విజ్ఞప్తి ప్రకటన చేసి చూశాడు చంద్రబాబు. చీకట్లో రాయి విసరడం వంటిదే ఈ ప్రకటన. కాని వరదలు ఎప్పుడూ వచ్చి పోయే ప్రకృతి వైపరిత్యాలు; కాని ఇప్పుడు తప్పితే మళ్లీ సాధ్యం కాని రాజకీయ అవకాశం - ఈ ఉద్యమం. ప్రజలు వరదలను సులభంగా మర్చిపోతారు కాని, ధరల తగ్గింపులో ప్రతిపక్షాలు విఫలమైతే చాలా కాలం గుర్తు పెట్టుకుంటారు. ఈ తేడా తెల్సినవాడు కాబట్టే రాజశేఖరరెడ్డి కొందరు ఎమ్మెల్యేలలో కన్పించిన ఉపసంహరణ వాదాన్ని సున్నితంగా తిరస్కరించాడు. కమ్యూనిస్టులు ఆయన్ను సమర్థించారు.

మరొక వంక వీరు ఇదే మంకుపట్టు కొనసాగించగల్గితే రాష్ట్రంలో రాజకీయ ఉద్రిక్తత తప్పదు. ఇప్పటికే ప్రతి జిల్లాలోనూ నిరసన ఉద్యమం వేడి అందుకున్నది. చంద్రబాబు ఎంతగా ఏమీ జరగడం లేదన్నట్లు నటించినా, ఆయన ప్రలోభాలకు లొంగిన పత్రికలలో ఉద్యమం వార్తలు కన్పడకుండా చేయగల్గుతున్నా - ప్రజలలో మాత్రం చాపక్రింద నీరువలె వ్యాపిస్తున్నది వుద్యమం. ఇది వరకటి వలె వుద్యమాలకు మద్దతుగా ప్రజలు వీధులలోకి వచ్చే పరిస్థితి లేదు. కాని ప్రజాభిప్రాయం మాత్రం వుద్యమానికి అనుకూలంగా వుంది. *

విద్యుత్ ఛార్జీలు పెంచినందుకు నిరసనగా నెల్లూరులో గవర్నర్ రంగరాజన్‌కు వినతి పత్రం ఇస్తున్న కాంగ్రెస్, సిపిఐ నేతలు.

# గోవిందలస్వామికి వాస్తులేమి

విజయనగర రాజుల 'సకల సౌభాగ్యం' వల్ల తిరుపతి ఆలయాల మహోన్నతి పొందింది. ఇక్కడి ఆలయాల్లో 'గోవిందరాజస్వామి' ఆలయం ప్రముఖమైనది. ఈ ఆలయాన్ని క్రీ.శ. 1130లో శ్రీమద్రామానుజాచార్యులు నిర్మించారని ప్రతీతి. అనేక మంది రాజులు, పదామ్యులు ఈ ఆలయం అభివృద్ధికి కృషి చేశారు.

ఈ ఆలయం ఆవరణలోనే పార్థసారథి ఆలయం వుంది. ఒకప్పుడు ఇదే ప్రధానాలయం రామానుజాచార్యులు చిదంబరంలోని గోవిందరాజస్వామి మూల విగ్రహాన్ని ఈ ఆలయం

**వాస్తు సంగతులు**

ఉత్తరభాగంలో ప్రతిష్ఠించి ప్రాకారాలు నిర్మించాక నాలుగు వీధుల్ని ఏర్పరచి, జన నివాసాల్ని ఏర్పాటు చేశారు. అప్పటి వీధుల్ని గోవిందరాజస్వామి 'మాడ' వీధులంటారు.

### ఆలయవర్ణన!

ఆలయానికి నాలుగు దిక్కులా ఎత్తయిన ప్రహరీ వుంది. ప్రధాన గోపురం గాక మరి రెండు 'అంతర్గోపురా'లున్నాయి. దక్షిణం వైపున పార్థసారథి, ఉత్తరం వైపున గోవిందరాజస్వామి ఆలయాలున్నాయి. వీటిలో గోవిందరాజస్వామి ఆలయం పెద్దది. రెండు ఆలయాలకు ఆగమశాస్త్ర బద్ధమైన నిర్మాణాలున్నప్పటికీ



దుత్తలూరు మండలం, నేలంపరేగడి గ్రామంలో ఆక్రమణలకు గురౌతున్న చెరువుకట్ట.

'కృష్ణాలయం' మాత్రమే గోపురానికి ఎదురుగా కనిపిస్తుంది. అందువల్ల 'కృష్ణాలయం' ప్రాచీనమైనదని చరిత్రకారులు నిర్ణయించారు.

ఆలయానికి రెండు ప్రాకారాలున్నాయి. మొదటి ప్రాకారంలో వేదాంత దేశిక మండపం, లక్ష్మీదేవి, ఆళ్వారుల మందిరాలున్నాయి. రెండవ ప్రాకారంలో చక్రత్తాళ్వార్, ఆండాళ్ నాచ్చియార్, ఆళ్వార్, రామానుజ, తిరుమలైనంబి మందిరాలు, వరాహమండపం వున్నాయి. గోవిందరాజస్వామి ఆలయానికి ముందు భాగంలో వున్న చిత్రకూట మండపాన్ని క్రీ.శ. 15వ శతాబ్దిలో నిర్మించారు. గర్భగృహ, అంతరాళ వెలుపలి గోడల మీద అనేకమైన శిల్పాలున్నాయి. అయితే పార్థసారథి ఆలయంలోని 'కళ్యాణమండపం'లో అద్భుతమైన శిల్పాలున్నాయి. శిల్పకళాజగతిలో వీటికొక ప్రత్యేక స్థానం వుంది.

పశ్చిమ, దక్షిణ భాగంలో 'ఆండాళ్' మందిరం వుంది. గర్భగుడిలో 'అనంతశాయి' బృహత్ విగ్రహం వుంది. ఈ శిల్పానికి నెల్లూరు శ్రీరంగనాయకులకి, ఉండవల్లి (విజయవాడ) మహాలయములోని శయన మూర్తికి పోలిక ఉన్నాయి.

స్వామి తలచెంత 'తలగడ' పాదాల వద్ద శ్రీదేవి, భూదేవి విగ్రహాలు వున్నాయి.

### చారిత్రక అంశాలు!

క్రీ.శ. 12 శతాబ్ది నుంచి గోవిందరాజస్వామి పూజలందు కుంటున్నారు. శివభక్తుడైన మొదటి కులోత్తుంగ చోళుడి పాలనా కాలంలో క్రీ.శ. (1070 - 1120) మిన్నకుంటిన రామానుజాచార్యులు క్రీ.శ. 1130 తర్వాత వైష్ణవ మత ప్రచారానికి విపరీతమైన కృషి చేశారు.

చోళరాజు మూడవ రాజరాజు క్రీ.శ. 1235 శాసనం ప్రకారం అప్పటికి ముఖమండపం, మూడు ప్రక్కలా స్తంభాల వసారా, అంతరాళం, గర్భగృహం మాత్రమే వుండేవని తెలుస్తుంది. క్రీ.శ. 1308 శాసనం ప్రకారం ఇక్కడ 'ఆండాళ్' ఆలయం జరిగిందన్న విషయం తెలుస్తుంది. క్రీ.శ. 1445, 1456 శాసనాల్లో స్వామి వారి విశేషోత్సవాలు పేర్కొనబడ్డాయి.

క్రీ.శ. 1224, 1237 సంవత్సరాలలో యాదవ వీరనరసింహదేవ రాయలు ఆలయాన్ని అభివృద్ధి పరిచారు.

క్రీ.శ. 1513 ఆలయానికి తూర్పు దిశలో వున్న పుష్కరిణిని నిర్మించారు. దీన్ని తెరుక్కోనేరి అని, గోవిందరాజస్వామి పుష్కరిణి అని, కృష్ణరాయ పుష్కరిణి అని వ్యవహరిస్తుంటారు.

క్రీ.శ. 1533 శాసనం ప్రకారం గోవిందరాజస్వామి ఉత్సవ విగ్రహం ముందు ఉత్తర మాడ వీధిలో దేవదాసీలు నృత్యం చేసేవారని వుంది. ఆలయానికి 'దివ్యాలంకరణ'గా వున్న అంబర చుంబితమైన గాలి గోపురాన్ని రాయ సామంతుడు మల్లు అనంతరాజు క్రీ.శ. 1624లో నిర్మించాడు. మల్లు అనంతరాజును గురించి ఈ సందర్భంగా కొంత చెప్పవలసి వుంది. విజయనగర రాజుల రాజ్య విస్తృతికి కారకుడైన ఎల్లమరాజు కుమారుడు అనంతరాజు. ఇతను 'సిద్ధవటం' ఆదిగాగల కడప మండల పాలకుడు. సాహిత్య రంగంలో సుప్రసిద్ధుడు. 'కకుత్స్థవిజయ' కావ్యరచయిత. క్రీ.శ. 1591లో పెనుగొండ వద్ద జరిగిన యుద్ధంలో ఇతను 'గోల్కొండ' నవాబు కులీకుతుబ్‌షాను జయించాడు. క్రీ.శ. 1593 గుర్రంకొండ (చిత్తూరు జిల్లా) యుద్ధంలోను, క్రీ.శ. 1594లో మధుర వీరప్ప నాయకుని తోటి యుద్ధంలోనూ అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించి వారిని జయించినట్లు ఇతని మనుమడైన మల్లు కుమార అనంతరాజు కావ్యం 'కుముద్వతీ కల్యాణం'లో పేర్కొనబడింది.

### ఆలయవాస్తు!

ప్రాకారంలోపల దక్షిణంలో పార్థసారథి, ఉత్తరంలో గోవిందరాజస్వామి ఆలయాల నిర్మాణం వల్ల 'ఆగమ శాస్త్ర నిబంధనలకు' తిలోదకాలిచ్చిన సంఘటనలు అనేకం జరిగాయి.

పార్థసారథి ఆలయం కొన్ని 'దశాబ్దాలపాటు' మూతపడి వుండటం వల్ల యమస్థానం, 'వికర్షణ' చెందింది.

మొదటి ప్రాకారంలో 'కుబేర స్థానం'లో మనవలముని, ఆళ్వారు ఆలయాలు, ఇతర మండపాలు, ఆలయానికి 'పీడనను' కలిగించాయి.

అలాగే రెండవ ప్రాకారంలోని ఉత్తరంలోని రెండతస్తుల మండపం, ఇతర ఆళ్వారుల మందిరాల ఆలయ వాస్తు స్థితిని 'నీచం' చేశాయి.

రెండు ప్రాకారాల్లోనూ నిర్మాణాల విషయమై తగిన జాగ్రత్తలు తీసుకోక పోవడం, కుబేర స్థానంలో మండపాల నిర్మాణాలు విపరీతం చేయడం కూడా కుబేర, ఇంద్రస్థానాల 'ఆకర్షణ' శక్తిని నిర్వీర్యం చేశాయి.

ఆలయం 'దిక్సూచి'గా సమంగా లేకపోవడం, 'కోణ' పరంగా వాయు, అగ్ని, స్థానాలు పెరగడం, స్థల ఉచ్చ, నీచ పరిమాణం 'సమతుల్యత'ను కోల్పోవడం వంటి అనేక కారణాల వల్ల ఆలయానికి జనాకర్షణ శక్తి లోపించింది.

అయితే క్రీ.శ. 12 శతాబ్ది నుంచి పూజాదికాలు కొనసాగడానికి తూర్పు, ఉత్తర భాగాల్ని స్పృశిస్తూ నెలకొని వున్న పుష్కరిణి కారణం.

విచిత్రమైన విషయం ఏమిటంటే తిరుమలను ఎనిమిదిసార్లు సందర్శించిన శ్రీకృష్ణ దేవరాయలు, గోవిందరాజస్వామిని ఒక్కసారి కూడా దర్శించక పోవడం! రాయల వ్యక్తిగత శాసనం ఒక్కటి కూడా ఇక్కడ లేకపోవడం!!*



కావలి జవహర్ భారతి స్వర్ణోత్సవాలను ప్రారంభిస్తున్న గవర్నర్ డా. సి. రంగరాజన్, ప్రక్కన గవర్నర్ సతీమణి హరిప్రియ రంగరాజన్, జస్టిస్ వి. వెంకటరామిరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ తదితరులు వున్నారు.

## వాసి పెరగాలి

5వ పేజీ తరువాయి

నం, పరిశోధనల ద్వారా రైతులను విజ్ఞానవంతులు చేసి అధిక దిగుబడులు సాధించినప్పుడే రైతులకు మేలుచేసే వాళ్ళవుతామని జిల్లా కలెక్టర్ కె. ప్రవీణ్‌కుమార్ తెల్పారు.శుక్రవారం జిల్లా పరిషత్ మీటింగ్ హాల్లో ఆచార్య ఎన్.జి. రంగా వ్యవసాయ విద్యాలయం ఆధ్వర్యంలో రబీ సీజన్ 18, 19 రెండు రోజుల జోనల్ రీసర్చ్, ఎక్స్‌టెన్షన్ అడ్వయిజరీ కౌన్సిల్ మీటింగుకు జిల్లా కలెక్టర్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. జిల్లాలోని కొన్ని గ్రామాలను వ్యవసాయ అధికారులు దత్తతకు తీసుకొని ఎప్పటికప్పుడు మారుతున్న వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానం గుర్చి పరిశోధనలు నిర్వహించి గ్రామ ప్రజలు, రైతులకు నూతన వ్యవసాయం, ఆర్థిక దిగుబడుల సాధనకు కృషి చేయాలన్నారు. గ్రామ రైతులు, పొదుపులక్ష్మి సభ్యులు, సిఎంఇవై, నీటి సాగు సంఘాలు, వనసంరక్షణ సమితులు, విద్యా కమిటీల సభ్యులతో వ్యవసాయ సదస్సులు, కిసాన్‌మేళాలు, ప్రదర్శనలు ఏర్పాటు చేసి వారిలో అవగాహన కల్పించాలన్నారు. రేడియో, టి.వి., తెలుగులో ప్రచురించిన కరపత్రాలు తదితర ప్రచార సాధనాల ద్వారా గ్రామీణ రైతులకు వ్యవసాయ పరిజ్ఞానం గుర్చి తెలియజేయాలన్నారు. నిరక్షరాస్యులుగా వున్న గ్రామ రైతులకు ఆడియో, ప్రదర్శనల ద్వారా విజ్ఞాన వంతులను చేయాలన్నారు. పశుగ్రాసం, సన్‌ఫ్లవర్ తదితర పంటల వ్యవసాయ విధానాన్ని రైతులకు తెలియజేయాలన్నారు.

తిరుపతి వ్యవసాయ విద్యాలయం అసోసియేట్ డైరక్టర్ డా. ఆనందరావు సదస్సుకు అధ్యక్షత వహించారు. గత సంవత్సరం వాతావరణ పరిస్థితుల కారణంగా సదరన్ జోన్‌లో సరాసరి వర్షపాతం 1081 మి.మీ.లకు గాను 608 మి.మీ. వర్షపాతం నమోదై 44శాతం తగ్గిందన్నారు. దీని కారణంగా పంట విస్తీర్ణం గణనీయంగా తగ్గిందన్నారు. నెల్లూరు జిల్లాలో వ్యవసాయం ఎక్కువ శాతం పంట కాలువలు, చెరువులపై ఆధారపడి వుందన్నారు. నెల్లూరు జిల్లాలోని నెల్లూరు, పొదలకూరు, పెల్లూరు పరిశోధన కేంద్రాల ఆధ్వర్యంలో దేవిస్‌పేట, కళ్యాణపురం, బాలాయపల్లి గ్రామాలను దత్తతకు తీసుకొని గ్రామ రైతులకు వ్యవసాయ సాంకేతిక విజ్ఞానం, తదితర వ్యవసాయ విధానాల గుర్చి అవగాహన కల్పించి అధిక దిగుబడులు సాధించుటకు కృషి జరుగుతుందన్నారు. ఈ సమావేశంలో పాల్గొన్న అభ్యుదయ రైతులు వెంకటరామరాజు, హరికుమార్‌రెడ్డి, శివరామ్‌ప్రసాద్, నారాయణరెడ్డి, సుధాకర్‌రెడ్డి వ్యవసాయ సహాయ రిజైర్డ్ డైరక్టర్ రమణారెడ్డి కొన్ని సలహాలు, సూచనలు చేశారు.

ఈ నెల 18, 19 తేదీల్లో రెండు రోజుల పాటు జరిగిన సమావేశంలో చిత్తూరు, కడప, నెల్లూరు వ్యవసాయ సంచాలకులు పెద్దిరెడ్డి, సురేంద్రరెడ్డి, రంగారెడ్డి, శాస్త్రవేత్తలు, వ్యవసాయ అధికారులు, రైతులు పాల్గొని ప్రసంగించారు.

## పెన్న

5వ పేజీ తరువాయి

చేయకుండానే నీటిని వదిలేసి, మధ్యాహ్నం తర్వాత ఆయా మండలాలకు సమాచారం అందించారు. జిల్లా కలెక్టర్ రాత్రికి రాత్రే అధికార్లతో సమావేశం ఏర్పాటుచేసి హెచ్చరికలు జారీ చేశారు. ఎగువ ప్రాంతాల్లో పెన్న, పెన్న ఉపనదులు పొంగి ప్రవహిస్తున్నాయని తెలిసి కూడా నిర్లక్ష్యంగా వ్యవహరించిన ఇంజనీర్లపై జిల్లా కలెక్టర్ విచారణ జరిపి చర్య తీసుకోవలసిన అవసరం ఉంది.

# మదిలో శాంతి - ముఖంలో కాంతి

## సౌందర్య చెప్పిన అందాల చిట్కా

రోజురోజుకి సౌందర్య అందం ద్విగుణీకృతమవుతోంది. అందాల కథనాయకిని, మీ అందాన్ని మీరెలా సంరక్షించుకొంటారని అడిగాను. దీనికి జవాబుగా నేను ప్రత్యేకంగా టిప్స్ అంటూ పాటించనంది. మామూలుగానే వుంటాను. అయితే బేసిక్‌గా నాకో ఫీలింగ్ వుంది. మనిషిలో నిరాశలు అనేవి చాలాసార్లు చిన్న చిన్న విషయాల్లోనే కలుగుతుంటాయని పిస్తుంది. ఈ నిరాశల వల్ల మనసులో అలజడి పుడుతుంది. ఫలితంగా మానసికంగా త్వరగా అలసి పోతాం. ఆ అలసట, నిరాశ ముఖంపై ప్రతిబింబిస్తాయి. అప్పుడు ఎంత మేకప్ వేసుకొన్నా, ఎంత అందంగా తయారైన ముఖంలో వుండాల్సిన కళ వుండదు. ఆ కళ, లావణ్యం, అందం తాలుకూ ఫ్రెష్‌నెస్ అంతా మనసులోని ప్రశాంత తపైనే ఆధారపడి వుందని చెప్పింది.

### సౌందర్యే ఆదర్శం!

స్వయంవరం, మనోహరం, మనసున్న మారాజా చిత్రాలలో నటించిన లయకు హీరోయిన్‌గా చక్కటి గుర్తింపు వచ్చింది. ఆమె ఇంజనీరింగ్ చదువుతూనే సినిమాల్లో నటిస్తుంది. ఇలా రెండు పడవలపై కాళ్లెందుకు అని అడిగితే; సినిమా అంటే నాకెంత ఇష్టమో, చదువు అన్నా అంతే ఇష్టం. నా అదృష్టం కొద్దీ హీరోయిన్ అయ్యాను. రెండింటికీ న్యాయం చేయాలన్నదే తన ప్రయత్న మన్నారు. హీరోయిన్‌గా నిలదొక్కుకోవాలంటే ఎక్స్‌పోజింగ్ తప్పదు. కాని సౌందర్య ఎక్స్‌పోజింగ్ చేయకుండానే

తరువ 11వ పేజీలో



శ్రీదేవి మూవీస్ చిత్రంలో అంజలా జవేరి, బాలకృష్ణ

# చూపించాలనుకున్నా- చూపించేస్తున్నా!

## హైదరాబాదు సినిమా వార్తలు

అడిగిందే తడవుగా దేవుడిచ్చిన అందాలను ప్రేక్షకులకు దాపరికం లేకుండా చూపించాలని నిర్ణయించుకున్న తర్వాతనే, సినిమాల్లో ప్రవేశించానని సంఘవి చెప్పింది. తాజ్‌మహల్ లో చిత్రం ద్వారా సంఘవి తెలుగు ప్రేక్షకులకు పరిచయమై అనతి కాలంలోనే గ్లామర్ హీరోయిన్‌గా మంచి గుర్తింపును పొందింది. తెలుగులో తయారయ్యే ప్రతి మూడు చిత్రాల్లో ఒక చిత్రంలో సంఘవి వుంటుంది. అటువంటి సంఘవిని ఎక్స్‌పోజ్ చేయడంలో మీకంటూ పరిమితులు లేవా అని అడిగాను. దీనికి జవాబుగా ఎక్స్‌పోజ్ చేయటం తప్పు కాదు. అసలు సినిమా తార కావాలనుకొన్నప్పుడే ఈ విధంగా చేయాలని నిర్ణయించుకొన్నాను. ఎక్స్‌పోజ్ చేస్తేనే ముందుగా ఫలానా హీరోయిన్ అని గుర్తిస్తారు. లేదంటే ముక్కు మొహం తెలియకుండా వచ్చిన దారినే వెళ్లిపోవాలి. ప్రేక్షకులు ఆదరించినంత వరకు నాకు అవకాశాలు వచ్చినంత వరకు ఇదేవిధంగా నటిస్తుంటానని సంఘవి తేల్చి చెప్పింది.

# నగ్నసుందరికి 15వేల జరిమానా

## సిగ్గువదిలేసిన మమతాకులకర్ణి

గతంలో ఒక పత్రికకు నగ్నంగా, ఫోజిచ్చిన మమతాకులకర్ణిపై కోర్టులో కేసు నమోదైన విషయం పాఠకులకు విదితమే. ఈ కేసు విచారణకు గాను ఆమె కోర్టుకు బురఖాలో వెళ్లి, మేజిస్ట్రేట్ ముందు నిలబడిందట. బురఖాలో ఎందుకొచ్చావని మేజిస్ట్రేట్ ప్రశ్నించగా, పబ్లిక్ నుంచి ప్రెస్ నుంచి తప్పించు కొనేందుకు వచ్చానని జవాబు చెప్పిందట. కేసు వ్యవహారమై తీర్పునిస్తూ 15 వేల జరిమానా కట్టడమే, లేక జైలు శిక్షను అనుభవించడమో ఏదో ఒకటి నిర్ణయించుకోమని మేజిస్ట్రేట్ ఆమెకు ఛాయిస్ ఇవ్వగా, జరిమానా కట్టేసి బయటపడింది. ఇక ఎవరూ అభ్యంతరం పెట్టని విధంగా దుస్తులు ధరిస్తానని, ఈ సందర్భంగా మమతా కులకర్ణి చెప్పింది.

### రూటుమారిన మనీషా!

నేపాలీ సుందరి మనీషా కొయిరాల ఈ మధ్య సినిమాలకన్నా, సంఘ సేవపై మక్కువ చూపుతుంది. ముంబాయి, కలకత్తా, ఉత్తర ప్రదేశ్‌లో ఎంచుకొన్న ప్రాంతాల్లో పర్యటించి పేద, అనాథ బాలలకు కొంత ధనసహాయాన్ని అందించడమే కాక, మానసిక వికలాంగులను సందర్శించి, వారి సహాయార్థం కొన్ని సంక్షేమ కార్యక్రమాలను కూడా చేపట్టింది. ఇవికాక ఇటీవల జెనీవాలో జరిగిన యు.ఎన్.ఎఫ్.సి.ఎ సమావేశాలకు భారతీయ ప్రతినిధిగా కూడా వెళ్లింది. ఈ సమావేశాల్లో ఇతర డెలిగేట్స్‌ని అందచందాలతో ఆకట్టుకోవడమే కాక ప్రపంచ, భారతీయ జనాభాలకు సంబంధించిన తన పరిజ్ఞానాన్ని, పాండిత్యాన్ని ప్రదర్శించి ప్రత్యేక గుర్తింపును తెచ్చుకొంది. ప్రపంచ జనాభా దినోత్సవం రోజు ఢిల్లీలో జరిగిన సమావేశంలో కూడా మనీషా వుపన్యాసానికి మంచి గుర్తింపు లభించింది. ఆమె నటించిన మెహాబూబా, లజ్జా చిత్రాలు బ్రేక్ ఇవ్వకపోతే సంఘసేవ బాటనే ఎంపిక చేసుకొంటానంటుంది మనీషా.

### అమెరికన్ చిత్రానికి సింగీతం దర్శకత్వం

తనదైన ప్రత్యేక శైలిలో చిత్రాలు రూపొందించే దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు ఆయన అమెరికాకు చెందిన ప్రసిద్ధ నిర్మాణ సంస్థ మీడియా డ్రీమ్స్ కొరకు అడ్వెంచర్ కామెడీ థ్రిల్లర్‌ను రూపొందిస్తున్నారు. ఈ చిత్రం పేరు లిటిల్‌జాన్. ఇంగ్లిషు, హిందీ, తెలుగు, తమిళభాషల్లో ఈ చిత్రం నిర్మాణం జరుగుతుంది. తెలుగు దర్శకుడు రూపొందిస్తున్న తొలి అమెరికన్ చిత్రం లిటిల్‌జాన్. ఈ చిత్రంలో హీరోయిన్‌గా నటించే అవకాశాన్ని జ్యోతిక కొట్టేసింది. హీరోగా బెంట్లె మదుకు నటిస్తున్నాడు. హేరామ్ చిత్రానికి ఛాయగ్రహణ బాధ్యతలు చూసిన 'తిరు' అదే బాధ్యతలు, ఎ.ఆర్. రెహమాన్ వద్ద సహాయకుడు ప్రవీణ్ మణి సంగీత బాధ్యతలు చేపడతారు. *

# 'మనసున్న మారాజు' బాగున్నాడు

## చిత్రసమీక్ష

* * *

గ్రిద్దలూరు గోపాలరావు

"మనసున్న మారాజు" అనగానే అతను అన్నీ మంచి పనులే చేస్తాడని వేరే చెప్పనవసరం వుండదు. ఈ చిత్రంలో మనసున్న మారాజు, చినకాయలపల్లి అనే ఒక పల్లెటూరి జమీందారు. అతను యువకుడు. అతనికి చదువు ఒంటబట్ట లేదు. మానవత్వం నిలువెత్తున తనువంతా నిలిచింది. అతని తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోవటంతో అతని బామ్మ (మనోరమ) అతన్ని పెంచుతుంది. జమీందారీ పెత్తనమంతా బామ్మదే. ఆమె ధర్మ దేవత. ఆమె మంచి గుణాలన్నీ మనసున్న మారాజుకు చిన్ననాటి నుంచే అలవడ్డాయి. పెద్దవాడు కాగానే అతను పెత్తందారవుతాడు. అతన్ని అందరూ దొరబాబు (రాజశేఖర్) అని పిలుస్తుంటాడు.

న్యాయాన్ని నాలుగు పాదాల మీద నడపటం దొరబాబు ధ్యేయం. అతను మనసున్న మారాజుగా కష్టాల్లో వున్నవారిని ఆదుకుంటూ వుండటంతో అతను దానకర్ణుడుగా కూడా పేరుగడిస్తాడు. ఒక రైతు అప్పుల్లో కూరుకపోయి బాధపడుతుంటాడు. అప్పిచ్చిన పైడి రాజుకు (కోట శ్రీనివాసరావు) అప్పు చెల్లించి ఆ రైతును ఆదుకుంటాడు. ఇలా ఎన్నో చేస్తుంటాడు.

ఆ మంచి మారాజుకు ఒక ప్రేమ కథ కూడా వుంది. బస్తీలో చదివి ఆ ఊరు తిరిగొచ్చిన నీరజ (ఆషా శైని) అనే అమ్మాయి అతన్ని ప్రేమిస్తుంది. తెలివిగల అమృత (లయ) అనే అమ్మాయి ఆర్థిక పరిస్థితుల వల్ల చదువుకోలేనప్పుడు తన ధర్మగుణంతో దొరబాబు ఆమెను డాక్టర్ చదివిస్తాడు. ఆమె కోసం ఆ ఊళ్లో ఆసుపత్రి కట్టించి ఆమెను అక్కడ డాక్టర్ చేస్తాడు. ఆమె మీద దొరబాబు మనసు నిలుపుకుంటాడు. కాని అమృత దొరబాబును తనకు విద్యాదానం చేసిన దైవంగా భావిస్తుంది. ఆమె తన క్లాస్‌మేట్ ప్రదీప్ (పృధ్వీ)ను ప్రేమిస్తుంది. ఆ సంగతి తెలిసిన దొరబాబు బాధపడతాడు. ఎమ్మెల్యే కుమారుడికి బలవంతంగా అమృత నిచ్చి పెళ్లి చెయ్యదలుస్తారు. పెళ్లిరోజున అమృత పెళ్లి పీటల మీద నుంచి లేచివచ్చి దొరబాబును కౌగిలించుకుంటుంది. ఆమె చేతికి దొరబాబు వీపు మీది రక్తం తగులుతుంది. ఎమ్మెల్యే మనుషులు దొరబాబును చంపేందుకు వీపుపై కత్తితో పొడిచినట్టు తెలుస్తుంది. వెంటనే చికిత్స జరపటంతో దొరబాబు కోలుకుంటాడు. అమృత అతన్ని చేరుకుంటుంది. దర్శకుడు ముత్యాల సుబ్బయ్య సెంటిమెంటు పండించటంలో, ప్రేమను ఫలప్రదం చెయ్యటంలోను, హాస్యరసాన్ని సృష్టించటంలోను బహు నేర్పరి. ఈ మూడు అంశాలను ఈ చిత్రంలో ప్రత్యేక ధోరణిలో తీర్చిదిద్దాడు. జమీందారీ హోదాలో దొరబాబు మానవత్వాన్ని, గ్రామీణ నేపథ్యంలో అతని ప్రేమకథా విధానాన్ని ముత్యాల సుబ్బయ్య ఆకర్షణీ

తరువ 11వ పేజీలో

# వారఫలాలు

26-8-2000తేది నుండి 1-9-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; కర్కాటకంలో కుజుడు; సింహంలో రవి, బుధులు; కన్యలో శుక్రుడు; ధనుస్సులో కేతువు; కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు.

### మేషం

(అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఈ రాశి వారికి ఆర్థికంగా పరిస్థితి బాగుంటుంది. కొందరికి సహాయం చేయడం చేస్తారు. బంధువులతో భేదాభిప్రాయాలు సర్దుకుంటాయి. ఆలోచనలను ఆచరణ రూపంలో పెట్టగల ప్రయత్నం చేస్తారు. ఆస్తి, డబ్బు వ్యవహారాలు గతంలోవి రాజీకి వస్తాయి. కొత్త వస్తువులు కొనడం, రిపేర్లు జరుగుతాయి. ఉద్యోగులు గుర్తింపు, గౌరవాలు పొందుతారు. అధికారుల అనుకూలత బాగుంటుంది.

### వృషభం

(కృత్తిక 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆదాయం ఆశించినంత ఉండదు. కాని రాబడితో సమానంగా ఖర్చులుంటాయి. వృత్తి, ఉద్యోగాలలో శ్రమ, అదనపు బాధ్యతలు నిర్వహించడం జరుగుతుంది. అధికారుల సహకారం బాగుంటుంది. గౌరవ ప్రతిష్టలు బాగుంటాయి. కొన్ని సొంత పనులు సొంత నిర్ణయాలు తీసికొని జరుపుతారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది.

### మిధునం

(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

పనులు జరుపుకొనడం కష్టం. ఆటంకాలు ఎక్కువగా ఉంటాయి. కుటుంబ సభ్యులకు అనారోగ్యబాధలు; అనుకున్నది జరగలేదనే మానసిక వ్యథ. ఆరోగ్య లోపం ఉంటుంది. కుటుంబ సభ్యులతో గొడవలు రావచ్చును.

### కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్లేషలు)

అన్ని రంగాల వారికి ఆర్థికంగా పరిస్థితి బాగుంటుంది. మీ పనులను చేసిపెట్టగల సహృదయులు లభిస్తారు. అప్పుడప్పుడు కోపం, ఉద్రేకం ఎక్కువగా ఉంటుంది. వివాదాలు సామరస్య ధోరణికి తిరుగుతాయి. సొంత ఆలోచనలను అమలు చేస్తూ ముందుకు సాగుతారు. అధికారులతో ఉద్యోగులకు సామరస్యం బాగుంటుంది. ఉద్యోగులకు మంచి ఆదాయం, పలుకుబడి వస్తుంది.

### సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

డబ్బు, ఆస్తి విషయాలలో పేచీలు రాకుండా జాగ్రత్తపడాలి. ఆర్థిక పరిస్థితి బాగుండి, వృత్తి, వ్యాపార రంగాలలో రాణించగలరు. వ్యవసాయ, సాంస్కృతిక రంగాల వారికి ఆశించిన ప్రయోజనం చేకూరదు. ఉద్యోగులు అధికారులతో వ్యవహరించే సమయంలో జాగ్రత్త పడాలి. ఆరోగ్యం కూడా లోపిస్తుంది. ఉద్యోగార్థులకు ఉద్యోగ లాభం, అధికారిక ప్రయాణాలు, నూతన వస్తువులు కొనడం జరుగుతుంది. విద్యాప్రగతి బాగుంటుంది. వారాంతంలో అదనపు ఖర్చులు పైనబడగలవు.

### కన్య

(ఉత్తర2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

ఆదాయంతోపాటు ఖర్చులు కూడా ఎక్కువగా ఉంటాయి. స్థిరాస్తుల కొనుగోలు, కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది. సొంత పనులు, ప్రభుత్వ పనులు సవ్యంగా జరిగిపోతాయి.

## పంచాంగం

పండుగలు

1తేది శుక్రవారం వినాయకచవితి

ముహూర్తములు

31 తేది గురువారం ఉదయం 8.02 గంటలకు కన్యాలగ్నాన వ్యాపార, అన్నప్రాశనలకు సుముహూర్తములున్నవి.

ఆగష్టు తిథులు

శ్రావణ బహుళ

తేది 26శని ద్వాదశి రా11.01గం.వ

తేది27ఆది త్రయోదశి రా8.28గం.వ

తేది28సోమ చతుర్దశి రా6.15 గం.వ

తేది29మంగళ అమావాస్య సా 4.10

భాద్రపద శుద్ధ

తేది 30బుధ పాడ్యమి ప2.05గం.వ

తేది 31బేస్త విదియ ప12.30గం.వ

సెప్టెంబరు తిథులు

తేది 1శుక్ర తదియ ప11 .17గం.వ

ప్యాయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

అధికారుల వల్ల కొద్దిపాటి ఇబ్బందులున్నా పనులు జరుగుతాయి. అనుకోని దూరప్రయాణాలు, అదనపు బాధ్యతలను నిర్వహించడం, ప్రముఖులతో స్నేహాలు ఉంటాయి. విద్యాప్రగతి బాగుంటుంది.

### తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

బాధ్యతల వల్ల శ్రమ, ఆరోగ్యం లోపించి బాధ ఉంటుంది. కుటుంబ సన్నిహితులకు కొద్దిగా ఆరోగ్యం లోపిస్తుంది. సోదరులతో విభేదాలు రావచ్చును. వృత్తి, వ్యాపార రంగంలో ఆశించినంత ఆదాయం రాదు. అనుకోని కుటుంబ ఖర్చులతో నలుగుతారు. ఉద్యోగ నిర్వహణలో కొద్ది తేడాలుంటాయి.

### వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం పెరుగుతుంది. నిలబడిపోయిన పనులు మరల కదులుతాయి. కార్యసాధన సామర్థ్యం చేకూరుతుంది. పెట్టుబడి రంగాలలో, వ్యాపార వృద్ధి ప్రయత్నాలలో అవకాశాలు లభిస్తాయి. విద్యార్థులకు చక్కని కృషి, కొద్దిపాటి ఉద్యోగ ప్రాప్తి, ఇంటి రిపేర్లు, వాహన రిపేర్లు జరుగగలవు.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఆర్థిక పరిస్థితులు సంతృప్తికరంగా ఉండవు. డబ్బు అవసరాలు ఎక్కువగా ఉంటాయి. కుటుంబ సమస్యలు ఇబ్బంది పెట్టగలవు. వాహన రిపేర్లు, అనుకున్న పనులు సవ్యంగా జరుగకపోవడం, శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును.

### మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

వ్యాపార పరంగా కొంత చిక్కు పరిస్థితులు కలుగవచ్చును. బంధుముఖ్యులందొకరికి ఆరోగ్యం సరిగా ఉండదు. వ్యవహారాలు, న్యాయస్థాన పరమైన కేసులు ఇబ్బందులు కలిగించవచ్చును. ఆర్థికపరమైన పనులు, సొంత పనులు జరిగిపోగలవు. చిన్న చిన్నగాయాలు, వాహన రిపేర్లుంటాయి.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. కొత్త వారితో పరిచయాలు పెరుగుతాయి. వ్యాపార వృద్ధికి ప్రయత్నాలు లాభిస్తాయి. ఇతురలతో వచ్చిన అభిప్రాయభేదాలు సర్దుకుంటాయి. శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును. కుటుంబ సభ్యులకు అనారోగ్య బాధలుండవచ్చును.

### మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థికస్థితి సంతృప్తికరంగానే సాగుతుంది. ఆదాయం, ఖర్చులు సమంగా ఉంటాయి. కుటుంబంలో విభేదాలున్నా సర్దుకొంటారు. బిడ్డలకు ఆరోగ్యం సరిగా ఉండదు. ఈ రాశి వారికి విద్యాప్రగతి బాగుంటుంది.

## జనవాణి

3వ పేజీ కొరవ

తీవ్రంగా వుంది. బాలాజీనగర్, స్టోన్‌హౌస్‌పేట, వెంకటేశ్వరపురం, హరనాథపురం, రామలింగాపురం, చిన్నబజారు, పెద్దబజారు, మూలపేట, జ్యోతినగర్, దర్గామిట్టలో సైతం దోమలు ప్రజలను రాత్రివేళ నిద్రపోనివ్వడం లేదు. కాని మునిసిపల్ పాలకులకు ఈ సమస్య గూర్చి పట్టడమే లేదు. కాల్వలను శుభ్రపరచడం, చెత్తా చెదారాన్ని ఎత్తడం వారం రోజుల కొకసారి చేస్తుండడం వల్ల దోమల బాధ మరీ ఎక్కువయ్యిందనాలి.

నెల్లూరు ఎస్. సువర్చల

### గ్రంథాలయ సంస్థ కార్యదర్శితో ఇక్కట్లు

జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శి నిరంకుశంగా ప్రవర్తిస్తూ తన క్రింది ఉద్యోగులను కించ పరుస్తూ ప్రతి చిన్న విషయానికి మెమోలు ఇస్తున్నారు. ఈ గ్రంథాలయ కార్యదర్శి వచ్చింది మొదలుకొని సంస్థ పరిపాలన అస్తవ్యస్తంగా తయారయ్యింది. వారానికి రెండు రోజులు మాత్రమే కార్యాలయానికి వస్తున్నారు. ఆయన మాత్రం టి.ఏలు, డి.ఏలు ఐదు వేల వరకు ప్రతినెలా డ్రా చేసుకోను డబ్బుందికాని, వుద్యోగులకు జీతాలివ్వను మాత్రం నిధులుండవు. ఫిబ్రవరి నెల నుంచి ఉద్యోగులకు శెలవు జీతం చెల్లించక తిప్పలు పెడుతున్నాడు. రిటైర్ అయిన ఉద్యోగులకు రావాల్సిన మొత్తాలు కూడా చెల్లించక ఇబ్బంది పెడుతున్న ఈ కార్యదర్శిపై ఉన్నతాధికారులు తగిన చర్యలు తీసుకోవాలని మనవి.

నెల్లూరు బాధిత ఉద్యోగులు

### ఆర్టీసి డబ్బులు వాపస్ చేయాలి

ఆర్టీసి కండక్టర్ల పోస్టుల నియామకానికి దరఖాస్తు చేయను ఒక్కొక్క నిరుద్యోగికి 200 రూపాయలకు పైగా ఖర్చయ్యింది. కాని ఈ పోస్టుల ఎంపికకు జరిగిన ఇంటర్వ్యూలను ప్రభుత్వం రద్దు చేసింది. దరఖాస్తు చేసినవారికి ఫీజు క్రింద చెల్లించిన 150 రూపాయలు తిరిగి చెల్లిస్తున్నట్లు చెప్పి వీటిని తీసుకోను కేవలం వారం రోజులు మాత్రమే గడువు పెట్టారు. సమయం తక్కువ కావడం వల్ల ఎక్కువ మంది ఈ ఫీజును తిరిగి తీసుకోలేక పోయారు. ఆర్టీసి ఉన్నతాధికారులు మరో వారం రోజులు గడువు పెంచి వసూలు చేసిన ఫీజును తిరిగి చెల్లించి నిరుద్యోగులను ఆదుకోమని మనవి.

నెల్లూరు . వి.శ్రీహరి

### సండేమార్కెట్ సమస్యకు పరిష్కారం

సండే మార్కెట్‌లోని వ్యాపారస్తులు మళ్లీ రోడ్డెక్కారు. వాస్తవానికి సండే మార్కెట్ ఆదివారానికి పరిమితమైన మార్కెట్ కాని ఈ మార్కెట్ ప్రతిదినం వుంటుంది. సండే మార్కెట్ వున్న స్థలం వాస్తవానికి మునిసిపాలిటీ రోడ్. కో ఆపరేటివ్ రూరల్ బ్యాంక్ తనకు దక్షిణ భాగంలో వున్న స్థలంలో షాపులు కడితే ఈ వ్యాపారస్తులంతా ఖాళీ చేయాల్సిందే. ప్రస్తుతం సండే మార్కెట్, ముందు షాపులు పెట్టుకొన్న వ్యక్తుల వల్ల ట్రాఫిక్ సమస్య ఉత్పన్నమవు తుందన్న వారిపై చర్య తీసుకోవాలని ఈ వ్యాపారులు కోరుతున్నారు. ఇద్దరు ఆక్రమించింది మునిసిపాలిటి స్థలమే కాబట్టి, మునిసిపాలిటీ భవిష్యత్తులో సమస్య లేర్పడకుండా ఈ సమస్యను పరిష్కరించాలి.

నెల్లూరు టి.వి.నారాయణ

### అవినీతిని అరికట్టాలి

భారతదేశంలో అవినీతి జాడ్యం మరీ ఎక్కువైపోయింది. సెంట్రల్ విజిలెన్స్ కమీషన్ (సివిసి) అవినీతి పరులపై కొరడా ఝళిపిం చేందుకు సిద్ధమవుతుంది. ఇది ఎంతో శుభపరిణామం. జీతభత్యాల క్రింద ప్రజాధనాన్ని అందుకొంటూనే ప్రజల వద్ద నుంచి అక్రమంగా లంచాలు వసూలు చేసేవారు ఎక్కువైపోయారు. దీనితో పాలనా వ్యవస్థ మొత్తం నిర్వీర్యమైపోయింది. ఈ పద్ధతిని చక్కదిద్దడానికి ఆవిర్భవించిన సెంట్రల్ విజిలెన్స్ కమీషన్‌కు అన్ని వర్గాలు సహకరించాలి.

నెల్లూరు కె.కరుణాకర్

### నదులను అనుసంధించాలి

దేశంలోని నదీ జలాలను సక్రమంగా వినియోగించు కోకపోవడం వల్ల అనేక సమస్యలు తలెత్తుతున్నాయి. దేశంలోని నదులన్నింటినీ అనుసంధానం చేయాలన్న పథకం ఈనాటిది కాదు. దశాబ్దాల క్రితమే ఇటువంటి ఆలోచన వచ్చినా ఆచరణకు నోచుకోలేదు. దీనివల్లే ఎన్నో రాష్ట్రాలు కరవుతో అల్లాడ వలసి వస్తున్నది. నదుల అనుసంధానికి వేల కోట్ల రూపాయలు ఖర్చవుతాయన్న వాదన అర్థరహితం. ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం మేలుకొని నదుల అనుసంధానాన్ని చేపట్టాలి.

నెల్లూరు షేక్. షరీఫ్

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

భక్తవత్సలం గారు మాట్లాడుతూ మన దేశంలో ఎందరో మహాపురుషులు జన్మించారు గాని, గాంధీ వలె ప్రజలతో సన్నిహితం గల వారు లేరని, అందువల్లనే వారిని భారత ప్రజలు పరమ పవిత్రంగా పూజిస్తారనిరి.

శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారు మాట్లాడుతూ, గాంధీజీ నెల్లూరుకి నాలుగుసార్లు వచ్చారనీ, ట్రంకురోడ్డులోని కూడలి ప్రదేశంలో ఆయన శిలా ప్రతిమ వుండటం వల్ల నెల్లూరు వాళ్లు ప్రతిరోజు ఎప్పుడో ఒకప్పుడు మహాత్ముని దర్శనం చేసుకోవడానికి అవకాశం ఏర్పడుతుందన్నారు.

### నెల్లూరు ముచ్చట్లు తులాభారం

ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారి, ఆధ్వర్యంలో 20తేది రాత్రి 9.30కు నెల్లూరు ఫైనార్ట్స్ సొసైటీ వారు `తులాభారం' ప్రదర్శించారు. నాటకం సంగతి ఎట్లా వున్నా నాడు స్టేజిలో సర్దుబాటు చేస్తుండిన కో ఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రార్ సుదర్శనరావు గారి తలపైన్నే తులాభారమంతా పడ్డట్టున్నది పాపం!

నాటకం రక్తి కట్టిందో లేదో చెప్పలేముగానీ సత్యభామ చేసిన `రంగరత్న, రాజహంస' శ్రీమతి వసుంధరా దేవికి పురుష కంఠమనీ, రుక్మిణి వేసిన లక్ష్మీకాంత, వసంతకుని పాత్రధారి కోట సుబ్రహ్మణ్య శాస్త్రి గారి కంటే ఎక్కువ నవ్వు పుట్టించిందని ప్రేక్షకులు అభిప్రాయపడ్డారు.

***

పెన్నలో నీరు ఆనకట్ట క్రింద 5.9అంగుళాలున్నాయి.

***

నెల్లూరు ట్రంకు రోడ్డులో స్థాపించిన గాంధీ విగ్రహం ఏమో బాగుండలేదు. ముందుగా చూడలేదా? ఏమిటి? - విమర్శకుడు

### సినిమా వార్తలు నిర్మాణంలో వున్న తెలుగు చిత్రాలు

పాతాళభైరవి, మల్లేశ్వరి, సౌదామిని, పరమానంద శిష్యులు, స్వప్న సుందరి, మాయలమరాటి, అదృష్ట జీవుడు, అగ్ని పరీక్ష, మాయారంభ, మానవతి, చంద్రప్రభ, మాయపిల్ల, సాయిబాబా, సంసారం, నిర్దోషి, వినోద ప్రొడక్షన్ నెంబరు ఒకటి, మొత్తం 16 చిత్రాలు నిర్మాణంలో వున్నాయి.

* * *

## ఆదాల పాక

4వ పేజీ కొరవ

నోటీసు ఇచ్చారు. దీనికి పోటీగా, రమేషొరెడ్డి సిపిఎం కౌన్సిలర్ల చేత అత్యవసర సమావేశానికి మరో రిక్విజేషన్ నోటీసు ఇప్పించి, పోటీగా 12వ తేది సమావేశం ఏర్పాటు చేయించారు. కాంగ్రెస్ కౌన్సిర్ల రిక్విజేషన్ నోటీసుకు మాత్రం 21తేదిన సమావేశం జరపాలని నిశ్చయించారు.

సిపిఎం కౌన్సిలర్లను అడ్డంపెట్టుకొని రమేషొరెడ్డి నాటకం ఆడుతున్నాడని ఆగ్రహించిన కాంగ్రెస్ కౌన్సిలర్లు 12తేది సమావేశానికి రెండు దఫాలు కోరం లేకుండా చేశారు. మంత్రి ఆదాల వర్గీయులైన కౌన్సిలర్లు కూడా సమావేశానికి రాలేదు. తర్వాత రమేషొరెడ్డి పరువు, సిపిఎం ప్రతిష్ట కాపాడేందుకు 12వ వార్డు కౌన్సిలర్ కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి జోక్యం చేసుకొని, టిడిపి కౌన్సిలర్లను సిపిఎం కోరికపై ఏర్పాటుచేసిన సమావేశంలో కూర్చొబెట్టి కోరం పూర్తి చేశారు. మున్సిపల్ రాజకీయాల్లో కోటంరెడ్డి రెండు పడవల్లో కాలుపెట్టి పయనిస్తున్నారు. మున్సిపల్ రాజకీయాల్లో రమేషొరెడ్డికి, బయట ఆదాల ప్రభాకరరెడ్డికి డప్పు వాయిస్తున్నాడు. ఆయనను ఆదాల పూర్తిగా నమ్మకపోయినా, రమేషొరెడ్డికి మాత్రం నమ్మక తప్పిందిలేదు.

గత నాలుగు నెలల మున్సిపల్ రాజకీయాల్లో కొన మెరుపు 17వార్డు నుంచి ఇండిపెండెంట్‌గా గెలిచిన పిండి సురేష్ మళ్లీ వివేకా కౌగిలికి చేరిపోవడం. మున్సిపల్ ఎన్నికల్లో టిక్కెట్ ఇవ్వలేదని వివేకాపై అలిగి ఇండిపెండెంట్‌గా గెలిచిన సురేష్ ఆ తర్వాత పరిణామాల్లో తెలుగుదేశం పార్టీకి దగ్గరయ్యారు. అయితే ఆ పార్టీలో కుమ్ములాటలు రమేష్ రెడ్డి వర్గీయులు, దారి తెన్నూ లేకుండా చేస్తున్న రాజకీయాలపై విసిగిపోయి నట్టున్నాడు. దీన్ని పసిగట్టిన వివేకానంద రెడ్డి, సురేష్‌కు ప్రేమ లేఖరాసి దగ్గరకు తీసుకొనే ప్రయత్నాలు మరో కంటికి తెలియకుండా చేశారు. తన పూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని, నాలుగో వార్డు ఛైర్మన్ కమిటీ పదవిని తనకు అప్తులైన కౌన్సిలర్లను కూడా కాదని సురేష్‌కు అప్పజెప్పిన తర్వాత కాంగ్రెస్ తీర్థం ఇచ్చారు. మున్సిపల్ రాజకీయాల్లో చెరిసమంగా బలం వున్న పరిస్థితుల్లో సురేష్ ఓటు కీలకమైంది. వివేకానందరెడ్డి తెలివిగా దాన్ని సొంతం చేసుకున్నాడు.

## నెల్లూరులో కాంగ్రెస్ నిరసన

విద్యుత్ ఛార్జీల పెంపును నిరసిస్తూ హైద్రాబాద్‌లో ఎమ్మెల్యేల ఆమరణ దీక్షకు మద్దతుగా నెల్లూరులో మహిళా కాంగ్రెస్ ఆధ్వర్యంలో గాంధీ బొమ్మ వద్ద నిరాహారదీక్ష చేశారు. జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ ఆధ్వర్యంలో జరిగిన ఈ నిరసన దీక్షలో డిసిసి అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి, మాజీ మంత్రి పనల పెంచలయ్య, ఆనం జయకుమార్‌రెడ్డి, దేవకుమార్‌రెడ్డి, ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, భానుశ్రీ, డాక్టర్ యశోధర, అనిత, నిర్మలమ్మ, కువ్వారపు రమణమ్మ, వైస్ ఛైర్మన్ నందానిబాషా, కౌన్సిలర్ బాలసుధాకర్, లంకా రామశివారెడ్డి, చెంచలబాబు యాదవ్ తదితరులు పాల్గొన్నారు. యూత్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో ఒకరోజు, పెద్దల కాంగ్రెస్ ఆధ్వర్యంలో మరో రోజు మైనారిటీ కాంగ్రెస్ రూరల్ మండల కాంగ్రెస్ పార్టీ తరపున ఇంకోరోజు, నిరసన దీక్షలు జరిగాయి.

## జైలులో జన్మాష్టమి

జిల్లా జైలులో శ్రీకృష్ణ జన్మాష్టమి వేడుకలను 22తేదిన ఘనంగా నిర్వహించారు. శ్రీకృష్ణుడు జైలులోనే పుట్టాడనేమో మన జైలు సూపరింటెండెంట్ అత్యంత భక్తి శ్రద్ధలతో, తానే స్వయంగా భజన చేస్తూ శ్రీకృష్ణ జన్మాష్టమి వేడుకలు చేశారు. ఈ సందర్భంగా సత్యసాయి సేవా సమితి వారి ఆధ్వర్యంలో భజన సత్సంగము, భక్తి బోధలన కార్యక్రమం నిర్వహించారు. అనంతరం ఖైదీలకు ప్రసాదాలను పంపిణీ చేశారు.

ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు నుంచి వనమిత్ర అవార్డును అందుకుంటున్న నెల్లూరు డి.ఎఫ్.ఓ. హరిప్రసాద్.

## రామకృష్ణ సంస్థకు స్వంత భవనం

నెల్లూరు రామకృష్ణ సేవా సమితి పొగతోటలోని కాసుభొలవారి అగ్రహారంలో ఒక సుందరమైన భవంతిని సమకూర్చుకుంది. ఈ నెల 16న రెండు అంతస్థుల ఈ భవంతిలోని పై అంతస్థులో శ్రీరామకృష్ణ పరమహంస చిత్రపటాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా నాలుగు గంటల పాటు పూజా కార్యక్రమాలను నిర్వహించారు. భక్తి గీతాలను ఆలపించారు. ఈ భవనంలో కింది అంతస్థులో శ్రీ వెంకటేశ్వర గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమంలో అమృతానందజీ, పరమార్థానందజీ, శ్రీకాంతానందజీ, సుకృతానందజీ, పోలూరి హనుమజ్జానకి రామశర్మ, మాచవోలు రాజశేఖరం, అనపల్లి అశోక్‌కుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

ఈ కార్యక్రమానికి సూత్రధారిగా వ్యవహరించిన ఎస్‌వి. నరసింహారావు అభినందనీయులు. 1968లో ఈ సేవా సంస్థ స్థాపించినప్పటి నుంచి, నరసింహారావుతో పాటు కార్యదర్శి టి.ఎల్. నారాయణరావు కూడా పోషంగా కృషి చేస్తున్నారు.

## సిపిఎం నిరసన

పెంచిన విద్యుత్ ఛార్జీలకు నిరసనగా ఈ నెల 21తేదిన సిపిఎం ఆధ్వర్యంలో ఆత్మకూరు బస్టాండ్ వద్ద రిలే నిరాహార దీక్ష చేపట్టారు. సిపిఎం పట్టణ కార్యదర్శి కె.జనార్దన్ శిబిరాన్ని ప్రారంభించారు. సిపిఐ పట్టణ కార్యదర్శి వి. రామరాజు, సిపిఐ (ఎం.ఎల్) న్యూ డెమోక్రసీ నాయకులు సి.హెచ్. కొండయ్య, ఎం. రామచంద్రయ్య, మోహన్‌రావు, బి. కృష్ణయ్య, జయకుమార్‌రెడ్డి తదితరులు కూడా ఈ కార్యక్రమాల్లో పాల్గొని మద్దతు ప్రకటించారు.

## నెల్లూరులో పచ్చదనం

నెల్లూరు జిల్లాలో శనివారం జరిగిన పచ్చదనం - పరిశుభ్రం క్రింద 24వేల 595 మీటర్ల పొడవు గల సైడ్ డ్రైన్లను శుభ్రం చేశారని, దీనికి 1720 మందిని వినియోగించారని జిల్లా కలెక్టర్ కె. ప్రవీణ్‌కుమార్ ఒక ప్రకటనలో తెలిపారు.

జిల్లాలో 20వేల మొక్కలను నాటారని, ఇందులో 10వేల 870 మంది బాలబాలికలు, 2,144 మంది ఉపాధ్యాయులు, 52 మంది ఎన్‌సిసి క్యాండెట్లు, 640 మంది ఎన్.యస్.యస్. వాలంటీర్లు పాల్గొన్నారని ఆయన తెలిపారు. 1450 మంచినీటి ట్యాంకులు శుభ్రం చేసి క్లోరినేషన్ చేశారన్నారు.

నెల్లూరు, కావలి, గూడూరు, పురపాలక సంఘ పరిధులలో శనివారం 277 టన్నుల గార్డేజిని, 870 మంది పనివారల ద్వారా తొలగించారని, దీనికి 52వాహనాలు ఉపయోగించారన్నారు. 25 మార్కెట్ ప్రదేశాలను శుభ్రం చేశారన్నారు. 11 జంతు వధశాలలు, ఎనిమిది మునిసిపల్ పార్కులు, 10స్మశానాలను శుభ్రం చేశారని కలెక్టర్ వివరించారు.

జిల్లాలో 1832 విద్యా సంస్థలలో, 67 ప్రభుత్వ ఆసుపత్రులలో, 59 ప్రైవేట్ ఆస్పత్రులలో, 240 ప్రభుత్వ కార్యాలయాలలో, 46 ప్రభుత్వ సంస్థలలో, 29 ఇతర సంస్థలలో పచ్చదనం పరిశుభ్రం కార్యక్రమాన్ని శనివారం చేపట్టినట్లు జిల్లా కలెక్టర్ వివరించారు.

468 ర్యాలీలను నిర్వహించారని, 20వేల 14 మంది ఇందులో పాల్గొన్నారని కలెక్టర్ పేర్కొన్నారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న ప్రజలు, ముఖ్యంగా మహిళలు, విద్యార్థినీ విద్యార్థులు, స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రజాప్రతినిధులు, ప్రభుత్వ అధికారులు, ఉద్యోగులను ఈ సందర్భంగా కలెక్టర్ అభినందించారు.

శ్రీ రామకృష్ణ మందిరం, శ్రీ వేంకటేశ్వర గ్రంథాలయం ప్రారంభోత్సవ సందర్భంగా జరిగిన సభలో కాంతానందజీ, పరమార్థానందజీ, అమృతానందజీ, సుకృతానందజీలను యతి పూజతో సత్కరిస్తున్న ఎ. అశోక్‌రెడ్డి సతీమణి. ప్రక్కన కార్యదర్శి నరసింహారావు వున్నారు.

## టిడిపి సమావేశం

4వ పేజీ కొరవ

మాజీ ఎమ్మెల్యే ఎల్లసిరి, నెల్లూరు నియోజక వర్గ తెలుగుదేశం ఇన్‌ఛార్జి, డెయిరీ ఛైర్మన్, పాలగోపాలుడు కూడా పాల్గొన్నారు. ఎల్లసిరి గతంలో జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడుగా కూడా పనిచేశారు. జిల్లా తెలుగుదేశం కమిటీ సమావేశానికి తనను అధ్యక్షత వహించమని కోరలేదని ఆయన గుర్రుగా ఉన్నారు. నరాలు తెగే బాధను కూడా పాపం, మనస్సులోనే దాచుకొని, సమావేశానికి హాజరయినట్టున్నాడు. మాజీ మంత్రి రమేష్‌రెడ్డి, మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధ అందరూ ఊహించినట్టు అసలు సమావేశానికి రాలేదు. తమకు బద్ధశత్రువైన శ్రీధరకృష్ణారెడ్డి అధ్యక్షతన జరిగే పార్టీ సమావేశం కాబట్టి తాము హాజరయ్యే ప్రశ్నే లేదని చెప్పేశారు. రమేష్‌రెడ్డికి, అనూరాధకు తెలుగుదేశం పార్టీలో ఉన్నస్థానం ఏమిటో, ఈ సమావేశమే నిదర్శనం. పార్టీలో ఏ పదవి లేని శ్రీధరకృష్ణారెడ్డి ఆధ్వర్యంలో జిల్లా పార్టీ సమావేశం ఎలా జరుపుతారని రమేష్ చిందులు తొక్కుతున్నాడు. ఈ సమావేశంలోనే, తెలుగు యువత మరో మాజీ నేత వై.వి.రామిరెడ్డిని కూడా శ్రీధరకృష్ణారెడ్డి తన ప్రక్కనే కూర్చొబెట్టుకున్నాడు. ఆయన విద్యుత్ ఛార్జీల సంగతి గాలికొదిలేసి, నెల్లూరు నియోజక వర్గ తెలుగుదేశం పార్టీ ఇన్‌ఛార్జి పాలగోపాల్‌ని చెడా మడా వాయించేశాడు. నెల్లూరులో కాంగ్రెస్, వామపక్షాలు విద్యుత్ ఛార్జీల పెంపునకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఆందోళన చేస్తున్నా, జిల్లా కేంద్రంలో తెలుగుదేశం పార్టీ చేతకానితనంగా వ్యవహరిస్తోందని అన్నారు. నెల్లూరు స్థానంగా ఉన్న సమర్థుడైన నాయకుడిని ఇన్‌ఛార్జి పదవిలో నియమించాలని డిమాండ్ చేశారు - పాలగోపాలుడికి నెల్లూరుతో సంబంధాలు లేవని, ఆయనది సర్వేపల్లి నియోజకవర్గమని అన్నారు. రామిరెడ్డి వ్యాఖ్యలతో ఖంగుతిన్న పాలగోపాలు, తాను నెల్లూరులోనే కాపురం ఉంటున్నానని చెబుతూ, పార్టీ ఇన్‌ఛార్జి పదవికి తనకు బదులు మరో వ్యక్తిని నియమిస్తే అభ్యంతరం లేదన్నారు.

విద్యుత్ ఛార్జీల పెంపును సమర్థిస్తూ కార్యకర్తలు, ప్రజల్లోకి వెళ్లి విస్తృతంగా ప్రచారం చెయ్యాలని, గది నాలుగు గోడల మధ్య నేతలంతా ప్రసంగాలను దంచేశారు.

## శాంతి

9వ పేజీ కొరవ

గ్లామర్ పాత్రలు పోషించారు. సౌందర్య బాపే నాకు ఆదర్శం. దర్శకుని అభిరుచి మేరకు కూడా కొన్ని సార్లు కట్టుబాట్లను సడలించుకోవాల్సి వస్తుందని వివరించింది.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

యంగా రూపొందించాడు. కథ కంటె కథనంలో వైవిధ్యం కనుపరిచాడు.

రాజశేఖర్ భావప్రకటన ప్రతి అంశంలోను ప్రశంసనీయంగా వుంది. లయ పర్వాలేదు. ఆషా షైనికి, పృధ్వీకి పెద్ద అవకాశం లేదు. కోట శ్రీనివాసరావు విలనీ, దొరబాబు మంచి తనాన్ని పెంచింది. టీ స్టాల్ ఓనరుగా బ్రహ్మానందం, మిఠాయి షాపు అతనుగా తిరుపతి ప్రకాష్, హెయిర్ కటింగు సెలూన్ సొంతదారుగా వేణుమాధవ్, పెళ్లిళ్ల పేరయ్యగా ఎల్బీ శ్రీరాం హాస్యానికి చక్కగా ఉపయోగించారు. హాస్యం కోసం పదే పదే వాడిన బూతు పదాన్ని తొలగించివుంటె సభ్యతగా వుండేది. లయ తండ్రిగా, త్రాగుబోతుగా తనికెళ్ల భరణి ఆవేశంతో ఊగిపోయాడు. అతనిలోని పశ్చాత్తాపాన్ని చక్కగా వ్యక్త పరిచాడు. రైతు బజారులో ఫైటింగు ఆకట్టుకుంటుంది.

తోటపల్లి మధు మాటలు సన్నివేశాలకు బలం కూర్చాయి. వందేమాతరం శ్రీనివాస్ సంగీతం వినసొంపుగా వుంది.

## సినిమా

9వ పేజీ కొరవ

దనం కరువు కాకుండా భవిష్యత్తులో కూడా ఇలాగే కొనసాగితే, జిల్లాలో పనిచేసిన మంచి కలెక్టర్లలో ఆయన కూడా ఒకరవుతారు. లేదంటే 'షరా మామూలే'.

### హీరోయిన్ల ఉత్సాహం

హీరో ప్రశాంత్ ఆధ్వర్యంలో విదేశాల్లో స్టార్‌నైట్‌లూ, స్టేజీషోల ప్రోగ్రాంల సంఖ్య పెరిగిపోతుంది. ఈ మధ్యే మలేషియాలో పలువురు తారామణులతో తరలి వెళ్లిన ప్రశాంత్ మళ్లీ ఆస్ట్రేలియాలో ప్రోగ్రామ్స్ ఫిక్స్ చేసుకున్నాడు. తాజాగా సౌదీ నుంచి కూడా కబురందుకొన్న హీరో గారితో హీరోయిన్లు రమ్యకృష్ణ, సువాలక్ష్మి, దేవయాని, రంభ తదితరులు తాము సిద్ధమంటూ సింగారించుకొంటున్నారట. టూరింగులే షూటింగులకన్నా బాగున్నట్లుంది.

* * *

Registered : RN 1156 / 57

No. A.P. / VJA / 52 / 8 / 2000



# సంస్కరణలు

2వ పేజీ తరువాత

విజయవాడ పార్లమెంట్ స్థానానికి తెలుగు దేశం అభ్యర్థిగా పోటీ చేసిన జై రమేష్ ట్రాన్స్‌ఫార్మర్ల సరఫరాదారుడు. 90 శాతం ట్రాన్స్‌ఫార్మర్లు ఆయన కంపెనీ నుంచి కొంటున్నది విద్యుత్ బోర్డు. అవి పనిచేయక పోయినా అడగడానికి లేదు. అడిగితే ముఖ్యమంత్రి నుంచి ఫోన్ వస్తుంది, కరెంట్ తీగలు అంతే; మీటర్లు అంతే.

ఛార్జీలు తగ్గిస్తే ప్రపంచ బ్యాంకు అప్పు ఇవ్వదని చంద్రబాబు భయపడుతున్నారు. అసలు ఈ అప్పు ఎందుకు తెస్తున్నారు, దేనికి ఖర్చు పెడుతున్నారు అన్నది బ్రహ్మ రహస్యం. ఆయన ముఖ్యమంత్రి పదవి చేపట్టేటప్పటికి రాష్ట్రం అప్పు 11వేల కోట్లు. ఇప్పుడు 36వేల కోట్లు. అప్పుడు ప్రభుత్వం జీతాలకు ఇబ్బంది పడలేదు. సరికదా, తెలుగు గంగ వంటి నీటిపారుదల పథకాలకు, ముద్దనూరు వంటి విద్యుత్ కర్మాగారాలకు వందలాది కోట్లు కేటాయించి పనులు జరిపించేది. గత ఐదేళ్ల కాలంలో చంద్రబాబు నాయుడు ఒక్క నీటిపారుదల పథకానికి ఒక్క పైసా వ్యయం చేయలేదు. ఒక్క నూతన పరిశ్రమ స్థాపించలేదు; ఒక్క కొత్త ప్రాజెక్ట్ చేపట్టలేదు. కాని ప్రభుత్వం దగ్గర జీతాలకు డబ్బు లేదు. అప్పులు మాత్రం మూడున్నర రెట్లు పెరిగాయి.

ఏమిటి దీనికి కారణం? ఈ ప్రశ్నకు చంద్రబాబు దగ్గర సక్రమమైన సమాధానం లేదు. ఎన్నికలు వచ్చినప్పుడల్లా ప్రజలను వంచించడానికి, తన ఎమ్మెల్యేలు పది రూకలు సంపాదించుకొని తను చెప్పినట్లల్లా వినడానికి జన్మభూమి వంటి వృథా పథకాలకు, ఆదరణ వంటి దుబారా కార్యక్రమాలకు వేల కోట్లు ఖర్చు పెట్టిస్తున్నాడు చంద్రబాబు. కేవలం తన రాజకీయ ప్రయోజనాల కోసం, తన పదవి కాపాడుకోవడం కోసం ఆయన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను నాశనం చేస్తున్నాడు. దాని ఫలితమే ఈ దుస్థితి; సంక్షోభం.

ప్రపంచ బ్యాంకు నుంచి తెచ్చిన అప్పు, తెచ్చిన పనికి వ్యయం చేయడం లేదన్నది నిజం. ఆ పనులు చేస్తున్న కాంట్రాక్టర్లకు బిల్లులు చెల్లించలేక పోవడమే అందుకు నిదర్శనం. రాష్ట్రంలో సంస్కరణలు విఫలం కావడానికి ఇది ఒక ప్రధాన కారణం.

ధరల విషయంలోనే కాదు, అభివృద్ధి పరంగా కూడా చంద్రబాబు అమలు జరుపుతున్న సంస్కరణలు రాష్ట్రానికి ఇప్పటి వరకు చేసిన మేలు ఏదీ లేదు; అప్పు పెంచడం తప్ప. గత నాలుగేళ్లుగా ఆయన విదేశాలు పర్యటిస్తున్నారు; విదేశీ అతిథులను పిలుస్తున్నారు; ఎప్పటికప్పుడు పత్రికా ప్రకటనలు చేస్తున్నారు. కాని ఒక్క విదేశీ సంస్థ కూడా ఆంధ్ర ప్రదేశ్‌లో పరిశ్రమలు స్థాపించడం లేదు. చంద్రబాబు అమెరికా పర్యటనకు ఎంత ప్రచారం జరిగిందీ మనకు తెలుసు. రాజు వెడలె రవి తేజము లలరగ అన్నట్లు వెళ్లాడాయన అమెరికాకు. అక్కడ ఆయన వాడిన లిమోసిన్ కారుకు రోజు బాడుగ ఐదువేల డాలర్లు (రెండు లక్షలా 15వేల రూపాయలు); ఛార్టర్ విమానం ఖర్చు రోజుకు యాభై లక్షలపైనే. మొత్తం ఆ పర్యటన వ్యయం పది కోట్లని అంచనా. అయితే కనీసం పది కోట్ల విలువైన పరిశ్రమలను కూడా రప్పించలేక పోయాడు. మలేషియా నుంచి వస్తుందనుకొన్న ప్రోటాన్ కార్ ఏమైపోయిందో తెలియదు. కంప్యూటర్ రంగంలోనూ అభివృద్ధి సంతృప్తికరంగా లేదు. ఇంకొక ప్రక్క సంస్కరణల పేరుతో ఆల్విన్ వంటి ఫ్యాక్టరీలు మూసివేశారు. ఐడిపిఎల్‌కు తలుపులు వేశారు. దాదాపు యాభైవేల మందికి వుద్యోగాలు పోయాయి. విశాఖపట్నం స్టీల్ ఫ్యాక్టరీ సైతం మూతపడే దశకు చేరుకున్నది. సింగరేణి బొగ్గు గనుల పరిస్థితి దయనీయంగా వుంది. రాష్ట్రంలోని అన్ని సహకార స్పిన్నింగ్ మిల్లులు, చక్కెర ఫ్యాక్టరీలు మూసి పారేస్తున్నారు. అదేమని అడిగితే సంస్కరణలు అంటున్నారు.

సంస్కరణల వల్ల కొత్త పరిశ్రమలు వస్తే సంతోషం. వున్నది మూతపడి, వుద్యోగాలు వూడితే ఈ సంస్కరణలు ఎందుకు? ఎవరి కోసం?

ప్రపంచ బ్యాంకు అప్పు విషయం కూడా అంతే. వారు ఇచ్చేది కొంచెం; ఆ పేరుతో పెట్టే నిబంధనలు అధికం. వారు ఇప్పటి వరకు ఇచ్చింది కేవలం 10వేల 200 కోట్లు. కాని అందుకోసం రాష్ట్ర ప్రభుత్వం కరెంట్ ఛార్జీలను పెంచింది; ఆర్‌టిసి బస్ ఛార్జీలను పెంచింది; రిజిస్ట్రేషన్ విలువ పెంచింది; మోటారు వాహనాల రిజిస్ట్రేషన్ ఛార్జీ పెంచింది; ఉప్పుతో సహా నిత్యావసరాలపై సేల్స్ టాక్స్ పెంచింది; రేషన్ బియ్యం ధర పెంచింది; కిరోసిన్, డీసల్ ధరలు పెంచింది. ఇంక పెంచడానికి ఏమీ మిగిలిలేదు.

దొరికిన ప్రతి మార్గంలో ప్రజల జేబులు కొల్లగొట్టి; నీటిపారుదల వంటి ప్రాజెక్టులు పూర్తిగా నిలిపివేసి, కేవలం జీతాలు మాత్రమే ఇవ్వడం తప్ప మరే అభివృద్ధి కార్యక్రమం చేపట్టకుండా ఈ అప్పులు ఎందుకు తెస్తున్నట్లు? రాష్ట్ర ప్రజలపై వడ్డీ భారం ఎందుకు మోపుతున్నట్లు?

చంద్రబాబు చెప్పేది ఒకటి; చేసేది మరొకటి. ఆయన దృష్టి ప్రజలపై కాదు - వారు ఇచ్చే ఓట్లపైన! ఆయన ప్రారంభించే ప్రతి పథకం లక్ష్యం ప్రజా ప్రయోజనం కాదు; తన రాజకీయ ప్రయోజనాలు నెరవేరేట్లుగా ప్రజలను మభ్యపెట్టడం; అందువల్లనే రాష్ట్రం ఇంతగా అప్పులలో, ఆర్థిక సమస్యలలో కూరుక పోతున్నది. వాటిలో విద్యుత్ ఛార్జీల పెంపకం ఒక భాగం. పత్రికలు, ప్రచార సాధనాల ఆసరాతో గత ఐదేళ్లుగా ఆయన తనను తాను సంస్కరణవాదిగా, రాష్ట్ర అభివృద్ధికి తపించే నూతన రాజకీయ వాదిగా చిత్రించుకున్నారు. ఇప్పుడు అది మానిపోయే పరిస్థితి ఏర్పడడంతో, కరెంట్ ఛార్జీల ఆందోళనను పోలీసు జులుం వుపయోగించి అణచి వేయడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజలకు ఈ నిజం అర్థమయ్యే వరకు ఆయన ఆటలు సాగుతాయి. అది అర్థమైన తర్వాత చంద్రబాబు చరిత్రహీనుడుగా మిగలక తప్పదు.

# బొల్లినేని

మొదటి పేజీ తరువాత

పోయినా వారిలో ఓపిక తగ్గలేదు; ఉత్సాహం క్షీణించలేదు. వరద సాకుతో వ్రతం విరమించడం మంచిది అని చాలా మంది ఎమ్మెల్యేలు వుర. వుర లాడినా, ఆ ప్రతిపాదనను వ్యతిరేకించారు నెల్లూరు ఎమ్మెల్యేలు. పర్యవసానం ఎట్లా వుండినా, ప్రభుత్వంలో కదలిక వచ్చే వరకు మేము మీతో పాటు దీక్ష కొనసాగిస్తామని రాజశేఖరరెడ్డికి ధైర్యం చెప్పారు.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.